# యతీంద్రలేఖలు

.... నాలుగవ భాగం ....

శ్రీ శ్రీ శ్రీ సీతారామ యతీంద్రులు



సంపాదకులు:

కుమారి ముత్తీవి 'పాప'

ముత్తీవి సీతారాం

శ్రీ యతీంద్ర ప్రచురణలు:

గంజాంవారివీథి: కాకినాడ:

# సంపాదకీయం

గత అయిదు దశాబ్దులుగా ఆంధ్రావనిలోనేగాక, అఖిల భారతంలోనూ ఆధ్యాత్మిక చైతన్యాన్ని ఉద్దీప్తంచేసి, ప్రేమ సందేశాన్ని వెల్లివిరియజేసి, సర్వేనూ నామ సంకీర్తనా మృత వాహినిలో ముంచెత్తిన మహాపురుషులు శ్రీ శ్రీ శ్రీ సీతారామ యతీంద్రులు.

ఏ పేరూ చెప్పకుండా ఊరికే పరమహంస అంటే శ్రీరామ కృష్ణ పరమహంసా, మహర్షి అంటే శ్రీ రమణమహర్షి మదిలో మెదులుతారు ఎవరికైనా. అలాగే యతీంద్రులు అన్న పదం వినగానే స్ఫురించేది శ్రీ శ్రీ శ్రీ సీతారామ యతీంద్రులే.

సూత్రభాష్యం అంటే బ్రహ్మసూత్రాలకు శ్రీ శంకర భగవత్పాదులు అనుగ్రహించిన భాష్యమూ, శ్రీభాష్యం అంటే బ్రహ్మసూత్రాలకు భగవద్రామానుజులు అనుగ్రహించిన భాష్యమూ, మహాభాష్యం అంటే పాణినీయ అష్టాధ్యాయికి పతంజలి అనుగ్రహించిన భాష్యమూ స్ఫురించినట్టే, ఎవరికైనా మహాసంకీర్తనం అనగానే శ్రీ శ్రీ శ్రీ సీతారామ యతీంద్ర గురుదేవుల నృత్య సహితసంకీర్తనమే తలపుకు వస్తుంది.

శ్రీవారిని కేవలం భగవదవతారంగా భావించి, విశ్వసించి ఆశ్రయించి, అనుభవించినవారు వేలసంఖ్యలో ఉంటే, కారణజన్ములుగా, మహాపురుషులుగా గౌరవించి, శ్రీవారి సూచనలమేరకు ఆధ్యాత్మిక సాధనలో ప్రయోజనం పొందినవారు లక్షల సంఖ్యలో ఉన్నారు.

శ్రీవారు శ్రీమద్భగవద్గీతను 'అమృతవాహిని' అన్నపేరుతో విపులమైన వ్యాఖ్య అనే ప్రవాహంగా అనే అరు అధ్యాయాలు ఆరు సంపుటాలుగా వెలువరించింది. తక్కిన అధ్యాయాలు వెలుగు చూడవలసిఉన్నాయి. శ్రీవారి 'ఉపదేశములు' అన్న గ్రంథం ఆధ్యాత్మిక పథగాములకు మార్గదర్శకమైన మహోత్తమ రచన. 'మధురవాణి' అన్న శతక పద్యంపరద్వారా ఆంధ్ర రసజ్ఞులు శ్రీవారి కవితామృతం కుత్తుకబంటిగా త్రావి త్రేన్చారు. ఇవికాక పరిశ్కృతంగా అముద్రితములుగా కొన్ని అసంపూర్ణములుగా కొన్ని-ఉన్న శ్రీవారి రచనలు ఆశ్చర్యచకితుల్ని చేస్తాయి ఎవరినైనా.

ఇంతచేసి "నేనేమీ చదువుకోలేదు; నాకేమి తెలియదు; నేను పండితుణ్ణికాదు; ఏదో నామం చేసుకుంటూ, పిచ్చివాడిలా తిరుగుతూ ఉంటాను; ఎవరైనా అడిగితే అదే చెప్తాను" అంటూ ఉండేవారు ఎప్పుడూ. అవును - నిండుకుండ తొణకదు; అన్నీ ఉన్న విస్తరి అణిగిమణిగే ఉంటుంది; "విద్యా దదాతి వినయం" అన్న నీతి మనకు తమ ఆచరణ ద్వారా నిరూపించిన దివ్యమూర్తి శ్రీ శ్రీ శ్రీ యతీంద్ర గురుదేవులు.

ఎప్పుడూ నీతియుతమైన ప్రవర్తనా, నామసంకీర్తనా- ఈ రెంటి మీదే తమ బోధనలను కేంద్రీకరించిన శ్రీవారు తమ భావ ప్రచారానికి లేఖలు ప్రధాన సాధనంగా తీసుకున్నారు.

యతీంద్రలేఖలు ఒకటి రెండు భాగాల ప్రతులు పూర్తిగా చెల్లిపోయాయి. మూడవ భాగంకూడా సగభాగం చెల్లిపోయి వచ్చే. ప్రస్తుతం నాలుగవ భాగం తమ కరకమలాల్లో సమర్పిస్తున్నాం. ఇదేక్రమంలో ఇంకా ఆరు భాగాలు ప్రచురింపబడవలసి ఉన్నాయి. ప్రతులు చెల్లిపోయిన భాగాలు పునర్ముద్రణ పొందవలసీ ఉన్నాయి. పరమోదారులైన తమ సహకారంతో క్రమంగా క్రొత్త భాగాల ప్రచురణా, ప్రతులు చెల్లిపోయిన భాగాల పునర్ముద్రణా త్వరలోనే చేయగలమని ఆశిస్తూ సహకార శిక్షకై సర్వులనూ అర్థిస్తున్నాం.

శ్రీవారి అమృతబోధలను ఆచరణలో ఉంచుకొనటంద్వారా ప్రతివ్యక్తీ పరిపూర్ణ ప్రయోజనం పొందాలని ఆశిస్తూ సర్వులకూ అట్టి సత్సంస్కారాలు అనుగ్రహించవలసిందిగా శ్రీశ్రీశ్రీ సీతారామ యతీంద్ర గురుదేవుల శ్రీచరణాల ప్రోల శిరసు మోపి నమస్కరిస్తున్నాం.

—సంపాదకులు

# కృతజ్ఞతాంజలి

యతీంద్ర లేఖలు - నాలుగవ భాగం-ప్రచురణకు ముందుగానే ఆరువందల పై చిలుకు ప్రతులకు వెల చెల్లించి ప్రచురణకు అనూహ్యరీతిలో సహకారం అందించిన యతీంద్ర సేవాసమితి - వివిధ శాఖల కార్యకర్తలకు హృదయపూర్వకంగా కృతజ్ఞతాంజలి అర్పిస్తున్నాం.

— సంపాదకులు

# యతీంద్రలేఖలు

## (నాలుగవ భాగం)

## 1

శ్రీ సంపత్కుమారాశ్రమము

శ్రీరస్తు: చిరంజీవిని......తల్లికి :
ప్రేమపూర్వక నారాయణస్మరణములతో
ఆశీర్వదించి : ఉభయకుశలోపరి :

ప్రియమైన తల్లీ !

నీ లేఖ అందింది. చదివి ఆనందించాము.

నేను గతలేఖలో నిన్ను 'బాబూ' అని సంబోధించాను- నిజమే. నీ మొదటి లేఖలో నీ పేరు 'శ్రీరాం' అని వ్రాసినందువల్లమాత్రమే నేను నిన్ను అలా సంబోధించలేదు- "నేను మీకు ఇప్పటివరకు పరిచయం లేనివాణ్ణి"అని నువ్వు వ్రాయటంవల్ల అలా పుంలింగంతో

సంబోధించాను. నీవు శరీరగతంగా ఎవరివైతే నాకేం ? సరాసరి నీతోనే ఆత్మతోనే - నాకు సంబంధం. పురుషుణ్ణి అని నీవు చెప్పుకుంటే బాబూ అని పిలుస్తాను. స్త్రీని అని చెప్పుకుంటే తల్లీ అని పిలుస్తాను. నిజానికి నీవు పురుషుడివీ కాదు, స్త్రీవీ కాదు. ఆత్మగతంగా చూస్తే, ఆత్మను పురుషుడు అని కూడా అంటారు. పురం అంటే శరీరం. శరీరంలో ఉండే తత్త్వం కనుక, పురుషశబ్దంచేత ఆత్మ చెప్పబడింది. ఆ దృష్టితో నిన్ను పురుషుడు అన్నా తప్పులేదు. నేను నీకు ఆత్మగతం గానే ప్రాధాన్యం ఇచ్చి వ్రాశాను. అందువల్లే "నీవు నాకు పరిచితుడవు కాకపోవటం ఏమిటి ? నీ శరీరంతో పరిచయం లేకపోవచ్చు. నీతో - ఆత్మతో - అనాదిగా, లక్షలాది జన్మలనుండి పరిచయంఉంది" అని వ్రాశాను.

తనను తాను ఆత్మగా తెలియక, దేహమే తానుగా భ్రాంతిచెందటం చేతనే మానవులకు ఇన్ని కష్టాలూ బాధలూ కలుగుతున్నాయి. నేను దేహాన్ని కాదు, ఆత్మను అని తెలిసిననాడు ఆనందం గంగా ప్రవాహంవలె ముంచెత్తుతుంది. ఆనందం పొందటానికి వేరే తపస్సు చెయ్యనక్కరలేదు-నువ్వు ఎప్పుడు ఎక్కడ ఏపని చేస్తున్నా, 'నేను దేహాన్ని కాదు, ఆత్మను' అని

జ్ఞాపకం ఉంచుకో. ఆ ఆనందం పరమానందంగా పరిణ మించటానికి రామనామం చేసుకుంటూ ఉండు. ఏ మాత్రం వీలు చిక్కినా, క్షణం కూడా వ్యర్థం చేసుకోక రామనామధ్యానంలో, సంకీర్తనలో గడుపు. ఇదే నిజమైన తపస్సు; దీన్ని విడిస్తే అంతా తమస్సే. ఇదే నిజమైన వేదాంతం; దీన్ని విడిస్తే అంతా ప్రాణాంతమే. అయితే, గృహస్థాశ్రమంలో ఉన్నంతకాలం ఈ ఆత్మ భావన అంతర్యంలో మననంచేసుకుంటూ బాహ్యంగా మాత్రం లోకమర్యాదలన్నీ పాటించాలి.

అమ్మా! నీ ఇష్టదైవం శ్రీరాముడు కనుక, నీ భర్తయందే శ్రీరాముని ఆరాధించు. అప్పుడు శ్రీరాముడు నీ భర్తయందే సాక్షాత్కరిస్తాడు. ఈ సాధనలో శ్రద్ధా పట్టుదలా కావాలి- అంతే. పట్టుదల సడలనీయకు; శ్రద్ధకు లోపం రానీయకు. ఇక శ్రీరాముడు నీవాడు అయ్యాడన్నమాటే.

తల్లీ ! నన్ను మరిచిపోకు. నేను ఇప్పుడు పుట్టింది పెదముత్తేవిలో. ఇది మచిలీపట్టణానికి సుమారు పదిహేను మైళ్ళ దూరంలో ఉంది. మీకు దగ్గరే గదా !

అందరికీ శుభాశీస్సులు.

ఇట్లు
సదా మీమేలుకోరు
సీతారాం

# 2

విజయవాడ

శ్రీరస్తు: చిరంజీవి......కి:
ప్రేమపూర్వక నారాయణస్మరణములతో
ఆశీర్వదించి: ఉభయకుశలోపరి:

ప్రియమైన బాబూ!

అకస్మాత్తుగా ఎందుకో నీకు లేఖ వ్రాయాలి అనిపించింది.

లోకంలో అందరూ- తల్లులు గాని, పురుషులు గాని- వివాహం చేసుకోవాలి అని ఉబలాటపడుతూ ఉంటారు, చేసుకుంటూనూ ఉంటారు. కాని, వివాహ తత్త్వం తెలియక పోవటంచేతా, తరువాత కూడా వధూ వరులు పరస్పరం తమ బాధ్యతలను తెలుసుకొని మెలగక పోవటంచేతా, తమ ధర్మాన్ని నెరవేర్చుకొనక పోవటంచేతా, వివాహం చేసుకొన్నందుకు తరువాత చింతించేవారే ఎక్కువగా ఉన్నారు. అలా చింతించని వారు వేయికి ఏ ఒక్కరో. ఇలా వెనుక చింతించటం వెర్రితనం కాదా!

బాబూ! మీ వివాహ సమయంలో మీకు ఆశీర్వచన రూపమైన సందేశం ఒకటి ఇచ్చాను. దాన్ని నువ్వూ నీ భార్యా మళ్ళీ చూచారో లేదో తెలియదు. వీలున్నప్పుడల్లా చదివి, దానిలోని భావాలను బాగా గ్రహించుకొని, మననం చేసుకొని హృదయానికి హత్తించుకోండి.

మానవుల హృదయాల్లో కోపతాపాలూ రాగ ద్వేషాలూ సహజంగానే ఉంటాయి. నగలూ, వస్త్రాలూ, ఇళ్ళు - మొదలైనవాటిమీద అమితమైన కాంక్షా ఉంటుంది. ఇతరులను చూచి సహించలేకపోవటమూ, తనవారిని ఏమీ అనలేకపోవటమూ కూడా సహజంగానే ఉంటుంది. ఇవన్నీ అందరిలోనూ పాళ్ళ తేడాలతో అయినా చోటుచేసుకొని ఉండే హృదయదౌర్బల్యాలు. అవి సమయం వచ్చినప్పుడు పైకి ఉబకటం, ఏ వ్యక్తిమీదనో దుమకటం జరుగుతూ ఉంటుంది. ఈ దౌర్బల్యాల్ని జయించటం కష్టసాధ్యం. అంతేకాని అసాధ్యం మాత్రం కాదు. ఈ విషయాన్ని బాగా గమనించి, ఆ దౌర్బల్యాల్ని జయించటానికి తీవ్రంగా ప్రయత్నించకపోతే, జీవితం దుఃఖమయమే అవుతుంది.

జీవితాన్ని జాగ్రత్తగా నడుపుకోనటంలోనే ఉంది మానవుని నేర్పరితనం. దంపతులు ముందు పరస్పరం తమవిషయంలో తాము అయినా జాగ్రత్తగా ఉండాలి. ఒకరియందు ఒకరు ప్రేమా గౌరవమూ కలిగి ఉండాలి. ఒకరిస్థితిని గమనించి, అనుసరించి ఒకరు సహాయం చేసుకోవటానికి సిద్ధంగా ఉండాలి. పరిస్థితులు గమనించకుండా భార్య భర్తను వేధించటంగాని, భర్త భార్యను బాధించటంగాని పనికిరాదు. తమ ఆర్థిక పరిస్థితులను గమనించే ఉభయులూ వ్యవహరించాలి.

భర్త రాబడి ఎంతో, దాన్ని ఎలా వెచ్చించాలో ఎంతవరకు వెచ్చించవచ్చో, ఎంత మిగల్చవచ్చో భార్య తెలుసుకుని ఉండాలి. ఏవేవి అవసరమో అనివార్యమో గమనించి, అనవసరపు వ్యయాలు చెయ్యకుండా జాగ్రత్తపడాలి.

సామాన్యదినాల్లో పొదుపు పాటిస్తూ, వీలైనంత తక్కువ వ్యయంతో గడిపి, అత్యవసర పరిస్థితులకోసం వీలైనంతగా సొమ్ము నిలువచేసుకోవాలి. ప్రస్తుతం ఇబ్బందిలేదుగదా అని ఉన్నదంతా వ్యయంచేస్తే, అవసరం వచ్చినప్పుడు బాధపడవలసివస్తుంది. ఇప్పుడు నిలువచేస్తే అవసరం వచ్చినప్పుడు ఉదారంగా వ్యయం

చేయవచ్చు. అయితే, ఈ జాగ్రత్త లోభంగా పరిణమించ కూడదు. అనవసరమైన వ్యయాలు చెయ్యకుండా, అవసరమైనవి మానకుండా జాగ్రత్తతో వ్యవహరించాలి. ఏ రోజు ఏ కూరలు, ఏ విధంగా, ఎంతెంత చెయ్యాలో ఆ బాధ్యత భార్యదే. ఆమె ఏమి చేస్తే భర్త అది తిని వెళ్ళాలి. భర్త యొక్క ఆరోగ్య పరిస్థితీ శ్రమా భార్య ఆలోచించాలి.

సాధ్యమైనంతవరకు అప్పు చెయ్యరాదు. ఒక వేళ అనివార్యంగా చెయ్యవలసివస్తే, ఆ అప్పును ఎంత త్వరగా తీర్చివేస్తే అంత మంచిది. తాను నిలువచేసిన సొమ్ములోనుండి తీసి వ్యయంచేసినా, దాన్ని కూడా అప్పుగానే ఎంచి, మళ్ళీ దాన్ని పూరించాలి.

తాము సంపాదించినదానిలో ఐహికంగానూ పారమార్థికంగానూ ఎవరెవరికి ఎంతెంత భాగం ఉన్నదో వారివారికి అంతంతా ముట్టజెప్పి, ఉన్నదానిలో తాము జాగ్రత్తగా గడుపుకోవాలి.

పల్లెటూరి జీవితం మరిచిపోయేస్థితి వచ్చింది కనుక గాని, పల్లెలలో ఇంటిని ఆనుకొని కొంత కాళీ స్థలం ఉండేది. దానిలో కూరలు పండించుకొని, వీలైనంత

వరకు కూరలు కొనవక్కరలేకుండా గడిపేవారు పల్లెల లోని ప్రజలు. స్థలాన్ని ఏమాత్రం వ్యర్థం చెయ్యరాదు. ఇంటిలోని ఏ వస్తువునూ పాడుచెయ్యరాదు. పనికి రానివి అని మనం అనుకొనే పెక్కు వస్తువులు నిజానికి ఏదోవిధంగా పనికివచ్చేవే. చింపిరిగుడ్డలూ, చింపిరి కాగితాలూ పనికిరానివి అనుకుంటాం మనం. కాని, వాటిని నానబెట్టి, రుబ్బి బుట్టలుగానూ పెట్టెలుగానూ చేసుకోవచ్చు, ఇవన్నీ భార్య బాధ్యతలోని పరిశ్రమలు.

పని ఏమీ లేకుండా కూచోటమే సుఖం అని భావించే దురదృష్టకాలం ఇది. పని చెయ్యటం అవమానకరం అని భావిస్తున్నంతకాలం వ్యక్తులుగాని, సంఘంగాని అధో గతికి పోతున్నట్టే. ప్రతివారూ ఏదో ఒక పనిని కల్పించు కొని చేస్తూ ఉండాలి. శారీరకంగా గాని, బౌద్ధికంగా గాని సోమరితనం ఎంతమాత్రం పనికిరాదు. అయితే, ఆ పని ఐహికంగా గాని, పారమార్థికంగా గాని ప్రయోజన కరంగా ఉండాలి గాని, ఊరకే కాలక్షేపంకోసం కాకూడదు.

వీటితోపాటు ముఖ్యంగా ఉండవలసిన లక్షణం కలుపుగోలుతనం. తన కుటుంబంలోని ఇతర వ్యక్తుల తోనూ, బంధువులతోనూ ఇరుగుపొరుగులతోనూ,

స్నేహితులతోనూ కలసి మెలసి ఉండాలి. లేకపోతే జీవితంలో మాటిమాటికీ అశాంతిపాలు కావలసివస్తుంది. కలుపుగోలుతనం జన్మతః కలవారు కొందరు ఉంటారు. ప్రపంచానుభవం కలిగినకొద్దీ వారికి ఈ లక్షణం వృద్ధి అయి, నలుగురిలో మెలిగే నైపుణ్యం వృద్ధిచెందుతుంది.

కాని, కొంతమంది దగ్గర ఇచ్చకాలు అనే లక్షణం ఉంటుంది. అది కలుపుగోలుతనం కాదు. అది మాత్రం పనికిరాదు. కలుపుగోలుతనానికీ ఇచ్చకాలకూ భేదం ఎలా తెలుస్తుంది అని సందేహం రావచ్చు- ఇచ్చకాలు చెప్పేవారు కూడా అందరితోనూ చక్కగా మాట్లాడతారు. అయితే, వారు ఉన్నవీ లేనివీ కూడా చెప్పి ఎదుటివారిని పొగుడుతారు. వారి మెుగ మెాటమి సంపాదించుకుంటారు. వారిచేత తమ పనులు చేయించుకుంటారు గాని, తాము వారికి ఏవిధంగానూ ఉపయోగించరు. తమ దోషాలు ఇతరులకు తెలిసినా, ఇతరులు తమను ఏమీ అనలేని స్థితిలో పెడతారు. ఈ విధమైన నైపుణ్యం ఎంతైనా ఉంటుంది వారిలో. కాని, మనకు కావలసింది ఇదికాదు. అందరితోనూ ప్రేమగా మెలగటం నేర్చుకోవాలి. ఇతరులు మన విషయంలో ప్రేమగా ఉండకపోయినా, మనం ఇతరుల విషయంలో

ప్రేమగా ఉండాలి. చేతనైనంతలో ఇతరులకు ఉపకారం చెయ్యటానికే సిద్ధంగా ఉండాలి. ఈ గుణంచేత ఇతరులను వశపరచుకోవచ్చు. ఇది ఇచ్ఛకాల ప్రబోధకాదు. ఇచ్ఛకాలకూ, కలుపుగోలుతనానికీ బాహ్యస్వరూపం ఒకవిధంగానే ఉంటుందిగాని, రెంటికీ కల భేదాన్ని గమనించి, అందరితోనూ కలుపుగోలుగా ఉండటాన్ని అభ్యసించాలి. లేకపోతే, వారికీ, వారితో సంబంధం కలవారికీ కూడా ఇబ్బందులే, జీవితం అంతా అశాంతే.

ఈ విధంగా అనుక్షణం జాగ్రత్తతో మెలుగుతూ అందరితో మంచిగా మెసలుతూ సాంసారిక జీవితాన్ని తీర్చి దిద్దుకుంటే, సాంసారిక జీవితమే పరమార్థ భవనానికి పునాదిగా, అండగా నిలవగలదు. ఇది ఆచరణలో కొంచెం కష్టంగా తోచినా, తమ పరమార్థ ప్రయోజనం కొరకు ఇంతమాత్రం భరించకపోతే ఎలా ?

బాబూ ! ఈ లేఖ నీ భార్యకూ, ఇంకా నాయందు విశ్వాసం కలవారికీ- అందరికీ చూపించు. ఇందులోని నా భావాన్ని అవగతం చేసుకుని, మననం చేసుకోండి. నేను చెప్పిన విధంగా నడుచుకొనటమే నాకు ప్రచారంలో తోడ్పడటం అంటే.

నా ఆరోగ్యం ఒక మాదిరిగా ఉంది. మొన్ననే తిరుమంత్రార్థ ప్రవచనం ఆరంభించాను. ఈ నెలాఖరుకు సమాప్తం కావచ్చు.

అందరికీ శుభాశీస్సులు.

ఇట్లు
సదా మీ మేలుకోరు
సీతారాం

## 3

హైదరాబాదు

శ్రీరస్తు: చిరంజీవి...............కి:
ప్రేమపూర్వక నారాయణ స్మరణములతో
ఆశీర్వదించి: ఉభయకుశలోపరి:

ప్రియమైన బాబూ!

మీరు పండరియాత్ర చేసుకొని క్షేమంగా ఇంటికి చేరారని తలుస్తాను. నువ్వు హైదరాబాదునుండి పండరిపురం వెళ్ళేప్పుడు మనం కొంతసేపు మాట్లాడాం. నువ్వు వెళ్ళేప్పుడు నాకు ఒక లేఖ ఇచ్చి వెళ్ళావు. అది చదువుకున్నాను. చాలా జాలి కలిగింది. కాని, ఏమిచెయ్యగలను?

ఒక వస్తువుయొక్కగాని, ఒక పరిస్థితియొక్కగాని, ఒక వ్యవహారం యొక్కగాని స్వరూపం ఉన్నదున్నట్టు తెలుసుకోనటం చాలా కష్టం. ఇతరుల విషయం అలా ఉంచి, ముందు తనవిషయమే తనకు తెలియదు. అవ్వను-వేం తెలుస్తుంది? ఎలా తెలుస్తుంది?

"త్రిభి ర్గుణమయై ర్భావై రేభిస్సర్వ మిదం జగత్
మోహితం నాభిజానాతి..............." అనీ,

"ఇంద్రియాణాంహి చరతాం యన్మనోఽనువిధీయతే
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివాంభసి" అనీ

భగవద్గీతలో చెప్పబడి ఉంది. "విషయములయందే సంచలించే ఇంద్రియాలను అనుసరించే మనస్సు మానవుని జ్ఞానాన్ని నశింపజేస్తోంది" అని మరోకచోట అంటాడు కృష్ణపరమాత్మ. తమకు తెలియదు. కాని, తెలుసు అనుకొంటారు. తెలిసి తెలిసి తాము తప్పుచేస్తూ, దాన్ని సమర్థించుకుంటూ, ఇతరులది తప్పుకాదు అని తెలిసి కూడా దాన్ని తప్పుగా నిరూపించాలని యత్నించి విమర్శిస్తూ ఉంటారు. ఇట్టివారితో ఎలా బాబూ! ద్వేష తీవ్రతకు - కోపతీవ్రతకు - తట్టుకోలేక, తీవ్రమైన జ్వరం వచ్చినవారివలె నోటికి వచ్చినట్టు ప్రేలుతారు ఇట్టివారు. ఇది సామాన్యంగా లోకంలో జరిగేది. పరమార్థం

కావాలి అని నావద్దకు వచ్చినవారైనా కనీసం ఈపద్ధతిని విడిచిపెట్టాలి. చాలామంది విడిచిపెట్టాం అనుకుంటారు. కాని, వారికి తెలియకుండా అంతరాంతరాల్లో ఎక్కడో ఈ లక్షణం ఉంటుంది. తన అంతఃకరణాను పరిశీలించు కొనటం సాధకునికి తెలియదు, చేతకాదు. అట్టి స్థితిలో గురువును ఆశ్రయించి, గురువువద్ద శిక్షణలో ఉండి తనను తాను తీర్చిదిద్దుకోవలసిందే. అయితే, దానికి గురువు నందు పరిపూర్ణ విశ్వాసం ఉండాలి. వచ్చిన చిక్కు ఏమంటే, గురువునందు తనకు ఉన్నది పరిపూర్ణ విశ్వాసం అనుకుంటాడు సాధకుడు. అది పరిపూర్ణంకాదు అంటే ఒప్పుకోడు. నిజమైన సాధకుడు తనకు గురువు నందు కల విశ్వాసంలో కొరత ఉంది అని గురువు చెప్పి నప్పుడు దాన్ని విశ్వసించి, ఆ కొరత తీర్చుకొనటానికి గురూపదిష్టమైన సాధనను అభ్యసిస్తాడు. కాని, చాలా మంది తమకు గురువునందు పరిపూర్ణ విశ్వాసం లేనట్టు కార్యరూపంలోకి వస్తేగాని తెలుసుకోలేరు. అంతవరకూ గురువు చెప్పినా విశ్వసించరు. ఇది మరీ ప్రమాదకరం.

గజేంద్రుడు పరమాత్మను ప్రార్థించాడు. ఆయన దర్శనం ఇవ్వలేదు. పరమాత్మ దయాస్వరూపుడుగదా ఎందుకు రాలేదు అంటే, పరిపూర్ణ విశ్వాసంతో పిలిస్తే

వస్తాడు. ఆ విశ్వాసంలో ఏమాత్రం కొరత ఉన్నా రాడు. గజేంద్రుడు పిలిస్తే రాలేదు అంటే, గజేంద్రుని విశ్వాసంలో కొరత ఉన్నదన్నమాట - ఇది నిర్ణయం. అంతే గాని, విశ్వాసం పరిపూర్ణం అయినా, పరమాత్మ రాక పోవటం అన్నది అసంభవం. అయితే, తనది పరిపూర్ణ విశ్వాసం కాదు అని గజేంద్రునికి తెలియలేదు. పైపెచ్చు తాను ఇంత ఆర్తితో పిలుస్తున్నా పరమాత్మ ఎందుకు రావటంలేదు అనుకున్నాడు. అసలు పరమాత్మ ఉన్నాడో లేడో అని సందేహించటంవరకూ వచ్చింది అతని స్థితి. చివరకు విశ్వాసం పరిపూర్ణం అయ్యాక రక్షణ వచ్చింది. గజేంద్రుని అంతటివాని స్థితి అలా ఉండగా, రాగద్వేషాలతో కూడుకొన్నవారిని గురించి వేరే చెప్పాలా?

బాబూ! నువ్వు పరమార్థం కొరకు నావద్దకు వచ్చావు. అయితే, పరమార్థమునందు నీకు ఉన్న కాంక్షను ఇతరులతోపాటు నువ్వుకూడా అధికంగా అంచనా వేసుకుని, దాన్ని పరిపూర్ణ భక్తిగా పొరపడ్డావు. ఆ తీవ్రతలో "ప్రభూ! నాకు ఎన్ని కష్టాలైనా ప్రసాదించి పరీక్షించండి - బ్రహ్మాధిపత్యాన్ని కూడా కాలితో తన్ని వేస్తాను" అన్నావు. సృష్టిలోని ఏ వ్యక్తినీ, ఏ వస్తువునూ నిరసనగా చూడరాదు, తృణీకరించరాదు. అయి

నప్పుడు కేవలం, భగవంతుని పరివారంలో శ్రేష్ఠుడు అయిన బ్రహ్మను తృణీకరించవచ్చా ?

అయితే, దీనికి ఒక అపవాదం ఉంది. పతివ్రత తన భర్త స్థానం ఇవ్వటం విషయంలో చక్రవర్తిని కూడా తృణీకరిస్తుంది. కాని, అది ఆమె పాతివ్రత్య సూచకమే కాని, అహంకార ప్రయుక్తం కాదు, కారాదు. అలాగే, భక్తుడు - తీవ్రభక్తుడు - పరమాత్మను పొందకుండా ఉండలేని స్థితికి వచ్చినవాడు - తాను కోరేది కేవలం భగవదనుభవాన్నే అని చెప్పటంలో బ్రహ్మాధిపత్యాన్ని కూడా తృణీకరిస్తాడు. అయితే, ఆ స్థితిలేనివాడు ఏ కారణం చేత అయినా అలా అంటే, అది భాగవతాపచారమే అవుతుంది. దానికి భగవద్రాజ్యంలో శిక్ష కూడా చాలా తీవ్రంగా ఉంటుంది.

బాబూ ! నాయందు మీకు ప్రేమా గౌరవమూ ఉంటే, నాలోని లోపాలూ, బలహీనతలూ కూడా మీకు సద్గుణాలుగానే తోస్తాయి. ఏ కారణంచేత అయినా, నాయందలి ప్రేమా గౌరవమూ తగ్గినప్పుడు నాలోని మంచి కూడా చెడ్డగానే కనపడుతుంది. అంతే కాదు - మీయందు ఉన్న చెడ్డకూడా నాయందు ప్రతిఫలించి నాయందు ఉన్నట్టే కనపడుతుంది. ఇక, తెలిసి

తెలిసి నాలోని 'మంచి'ని 'చెడ్డ'గా విమర్శిస్తే, నేను ఏం చేసేది? అట్టి స్థితిలో నేను మౌనాన్నే ఆశ్రయిస్తాను.

పరమార్థ ప్రచారంలో పాల్గొనగోరేవారు తమ భావాలూ ఆలోచనలూ పరమార్థానికి దోహదకరములు అయ్యేట్టూ, కనీసం వ్యతిరేకం కాకుండా ఉండేట్టూ చూచుకోవాలి. మీరు మీ బాధ్యతల్ని విస్మరిస్తే, అటు పరమార్థాన్నీ, ఇటు ఐహిక ప్రయోజనాన్నీ కూడా కోల్పోవలసి ఉంటుంది. ఇది జాగ్రత్తగా ఆలోచించుకుని నిజమైన వైరాగ్యాన్ని కలిగి ఉండాలి. ఇతఃపూర్వం ఏవైనా దోషాలు జరిగిఉంటే, హృదయ పూర్వకంగా పశ్చాత్తాపం చెంది క్షమాభిక్ష అర్థిస్తే, క్షమ తప్పక లభిస్తుంది. కాని, "ఒకసారి ఎలాగూ తప్పుచేశాం కనుక, ఆ తప్పును అలాగే కొనసాగిస్తూ ఉంటాను. మీరు క్షమించండి" అంటే ఎలా పొసగుతుంది?

నిజమైన, స్థిరమైన విశ్వాసంతో పరమాత్మ సన్నిధికి చేరటం- పరమాత్మకు అభిముఖుడు అవటం- మానవుని బాధ్యత. అట్టి స్థిరమైన విశ్వాసం ఉన్ననాడు, ఇతరములైన దౌర్బల్యాలు ఎన్నిఉన్నా, ఆయనే సరిచేసుకుని చేదుకుంటాడు. విశ్వాసంలో కొరత ఉంటే మాత్రం, ఇతరవిషయాల్లో ఎంత సామర్థ్యం ఉన్నా, ఆ కొరత

పూర్తి అయేవరకూ పూర్తి రక్షణరాదు. స్థిరమైన విశ్వాసాన్ని కూడా భగవంతుణ్ణే ఇమ్మంటే, ఇక మానవుని బాధ్యత ఏముంది!

ఉత్తమ శ్రేణికి చెందిన భక్తులను పరమాత్మ వరం కోరుకోండి అంటే వారు ఏం కోరుకుంటారు? బ్రహ్మలోక భోగాలు కూడా వారికి తృణప్రాయం. చివరకు మోక్షం కావాలి అన్న కోరిక కూడా వారికి ఉండదు. అట్టి స్థితిలో వారు "మాకు ఇతరములైన వేవి వద్దు- భగవన్, నీ యందలి విశ్వాసం శాశ్వతంగా ఉండేట్టూ, నీ భక్తియందే మా చిత్తాలు నిలచి ఉండేట్టూ అనుగ్రహించు" అని కోరుకుంటారు. పరమాత్మయందు అంతటి విశ్వాసమే లేకపోతే, అసలు సాక్షాత్కారమే అవదు. వారు అలా కోరటంవల్ల మూడు ప్రయోజనాలు ఉన్నాయి- మొదటిది - భగవదాజ్ఞ ననుసరించి వరం కోరుకుని పరమాత్మను గౌరవించినవారు అయ్యారు. రెండవది-నిజమైన భక్తులకు తాము గొప్పవారమనే భావం ఉండదు. కనుక, వారు తమమీద ఏమీ స్వాతంత్ర్యం గాని, కర్తృత్వంగాని ఉంచుకోరు. ఆ రెండూ వచ్చి నెత్తిన పడకుండా ఉంచటానికే వారు అలా వరం కోరుకోవటం. మూడవది-వినయం భక్తుల లక్షణం, స్వరూపం.

ఇంతకూ తేలిన సారాంశం ఏమంటే, మానవుడు సహజంగా అసమర్థుడు కనుక, సంసార సముద్రం నుండి రక్షింపబడటానికి వేరే ఏ బాధ్యతలూ పెట్టలేదు పరమాత్మ. త్రికరణశుద్ధిగా తనను విశ్వసించటం అన్న బాధ్యత ఒక్కటే మాత్రమే పెట్టాడు. ఇది కూడా చేత కాదుఅనటం మానవుని సోమరితనాన్నే వ్యక్తంచేస్తుంది. విశ్వసించవలసిన బాధ్యత మానవునికి ఉంది.

"నమ్మనేర్తుమింతేకాక
మాచేత నేమౌ నీకృప రాదా"

అన్నాడు ఒక మహాభక్తుడు. ఇది అహంకారం కాదు, బాధ్యత. అహంకార నిరాసనం కొరకు భక్తులు అనే మాటలను సాధకులు తమ లోపాలనూ సోమరితనాన్నీ కప్పిపుచ్చుకోవటానికి ఉపయోగించుకోరాదు. పరమాత్మను నిష్కపటంగా విశ్వసించండి. పరమాత్మయందు నిజమైన విశ్వాసం ఉంటే, పరమార్థాన్ని మాటుగా పెట్టుకొని, ఐహికం కొరకు ఉపయోగించుకోవటానికి ప్రయత్నించకండి. ఐహిక కాంక్షలు పూర్తిగా నశించకపోతే, వాటికొరకు ఉచితరీతిలో ప్రయత్నించవచ్చు. కాని, వైరాగ్యం కలవారివలె నటిస్తూ, పరమార్థాన్ని ఐహికానికి ఉపయోగించుకోవాలి అని ప్రయత్నించటం మహాపరాధం.

పరమార్థం కావాలి అని నావద్దకు వచ్చేవారు అభిమానాన్ని పూర్తిగా విడిచిపెడితేనే నావద్ద నిలవ గలరు. పరమార్థం లభించాలి అంటే అభిమానం పూర్తిగా నశించాలి. ఒక్క రూపాయి ఇచ్చేవారుంటే, వారివద్ద చేతులు నలుపుకుంటూ, వారు ఏమన్నా పడిఉంటారు. ఆ రూపాయిపాటి విలువ చెయ్యదా పరమార్థం! ధన వంతుల ఇండ్లలో వివాహాది శుభకార్యాల సందర్భంలో భోజనాలు జరుగుతూఉంటే, పిడికెడు ముద్దకోసం వీధి ద్వారం వద్ద ఒళ్ళంతా కళ్ళు చేసుకుని ఆశతో చూస్తూ ఉంటారు కొందరు అభాగ్యులు. మెడపట్టి గెంటేంచినా ఆ ముద్దకోసం అభిమానం వదలుకుని పడిగాపులు పడి ఉంటారు. ఆ ముద్దపాటి విలువ చెయ్యదా పరమార్థం! ఎంగిలి విస్తరాకు తీసుకువెడుతూంటే, అందులోని నాలుగు మెతుకుల కోసం కుక్క వెంటపడుతుంది. కాలితో తన్నుతున్నా, మరలదు. ఆ ఎంగిలి మెతుకుల పాటి చెయ్యదా పరమార్థం! అభిమానాన్ని ఇంతగా విడిచిపెడితేగాని పరమార్థం దక్కదు.

"మేము అభిమానాన్ని త్యజించాం" అంటారు చాలామంది. నేను వారి మాటను సందేహించక, స్వాతంత్ర్యం తీసుకుని పరమార్థ శిక్షణ ఇస్తూ ఉంటాను.

దాన్ని వారు తట్టుకోలేకపోతే, క్రింది శ్రేణిలోని శిక్షణే ఇస్తాను.

బాబూ! జాగ్రత్తగా ఆలోచించుకొని నీ ముందు జీవితాన్ని నిర్ణయించుకో. ఇదివరకటివలె బుడబుడ తొందరపడకు. నేను ఎప్పుడూ మీ హితం కోరేవాణ్ణే.

అందరికీ శుభాశీస్సులు.

ఇట్లు
సదా మీ మేలుకోరు
సీతారాం

## 4

ఖాజీపాతం

శ్రీరస్తు: చిరంజీవి..............కి:
ప్రేమపూర్వక నారాయణ స్మరణములతో
ఆశీర్వదించి: ఉభయకుశలోపరి:

ప్రియమైన బాబూ!

నీ లేఖద్వారా మీ క్షేమసమాచారం తెలిసి చాలా ఆనందించాము. ఉక్కు కర్మాగారాన్ని గురించీ, గోవధ నిషేధాన్ని గురించీ జరుగుతున్న ఆందోళనలవల్ల మా మద్రాసు ప్రయాణం వాయిదా పడింది. మళ్ళీ నిర్ణయం అవగానే వ్రాస్తాను.

నీ సాధనకు సంబంధించిన దైనందిన కార్య క్రమాన్ని గురించి నీ లేఖలో వ్రాశావు. అందులో మార్పు చేయవలసింది ఏమీ లేదు. యథాతథంగా దాన్నే కొనసాగించవచ్చు. తెలవారుజామున నాలుగున్నరకు నిద్ర లేస్తే చాలు. ఆరున్నర నుండి పదిహేను నిముషాలు ప్రాణాయామం చేస్తున్నాను అని వ్రాశావు. మంచిదే. కాని, నీవు చేసే విధానాన్ని గురించి తెలుసుకొనటానికి ఇంకా కొంత వివరణ కావాలి. నావద్ద ఉపదేశం పొందిన మంత్రాన్ని కుంభక సమయంలో జపిస్తున్నట్టు వ్రాశావు. అయితే, అకార ఉకార మకార అధిష్ఠాన దేవతల ధ్యానంతో మంత్రజపం చెయ్యటం అన్నదాని గురించి నువ్వు ఇంకా కొంత వివరంగా వ్రాయాలి. "మురళి ధరించి నృత్యం చేస్తున్న కృష్ణపరమాత్మ నాకు ధ్యాన మూర్తి" అని వ్రాశావు. అది చాలా మంచిదే. దృష్టిని భ్రూమధ్యంలో నిలపటం అభ్యాసం చెయ్యి. మంత్రజపం అన్నది స్నానం చేసిన తరువాత చెయ్యటం అవసరం - ఏవో కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో తప్ప. ఇక, మిగిలిన వన్నీ బాగానే ఉన్నాయి. కార్యక్రమం మరీ ఒత్తిడి అయితే, కొంతకాలానికి విసుగుతోచే అవకాశంకూడా ఉంది. అయితే, పట్టుదల కలవారికి అలా జరగదు. దీన్ని దృష్టిలో ఉంచుకొంటే మంచిదని వ్రాశాను.

మానవుడు లక్ష్యాన్ని సాధించటానికి సాధన చేస్తాడు; చేయ్యాలికూడా. అయితే, ఆ లక్ష్యం ఏమిటి? మోక్షం - మోక్షం అంటే విడుదల. దేనినుండి విడుదల అంటే ప్రకృతిబంధంనుండి. ప్రకృతిబంధం నుండి విడుదల పొందటం అంటే ఏమిటి, అసలు విడుదల పొందటం ఎందుకు అన్న విషయాన్ని వివరించటంలోనే అనేక అభిప్రాయభేదాలు వచ్చాయి.

ప్రకృతిబంధంలో ఉండటవల్ల దుఃఖాలూ, బాధలూ మొదలైనవి కలుగుతున్నాయి. కనుక, అవి లేకుండా చేసుకోవాలి అంటే, ప్రకృతిబంధనం నుండి విడుదల పొందాలి. అప్పుడు మాత్రమే దుఃఖం నివృత్తి అవుతుంది. ఈ దుఃఖనివృత్తి తాత్కాలికం కాక, శాశ్వతం కావాలి; ఆత్యంతికం కావాలి - అంటారు కొందరు. వారి దృష్టిలో ముక్తి అంటే దుఃఖం లేకపోవటమే - దాన్నే ఆనందం అని కూడా అంటారు.

కాని, దుఃఖనివృత్తి కావటం అనేది ఒక దశ; శాశ్వత బ్రహ్మానందం లభించటం ఇంకొక దశ. దుఃఖం లేకపోవటం వల్ల సహజ సిద్ధమైన ఆనందం అనుభవంలోకి వచ్చేమాట నిజమే. కాని, అది ఆనందశబ్దవాచ్యం అయినా, బ్రహ్మానందం కాదు. కేవలం భగవదనుగ్రహం

వల్ల లభించేదే బ్రహ్మానందం. అట్టి బ్రహ్మానందాన్ని పొందటమే మన లక్ష్యం. పరమాత్మ ఆనంద స్వరూపుడు కనుక ఆనందాన్ని పొందటం-మోక్షం-అంటే పరమాత్మను పొందటమే.

అయితే, పరమాత్మను పొందటానికి ఏమిసాధన చెయ్యాలి? పరమాత్మ సర్వత్రా ఉన్నాడుగదా! సర్వత్రా ఉన్న పరమాత్మను అనుభవించటానికి శారీరక, ఐంద్రియక, మానసిక ప్రతిబంధకాలు ఉన్నాయి మానవునికి. అట్టి ప్రతిబంధకాలను తొలగించుకొనటానికి ప్రయత్నించటమే సాధన అంటే. రాగద్వేషముల ఛాయకూడా లేకుండా చేసుకొనటానికి ప్రయత్నించటమే సాధన అంటే. రాగద్వేషాలు నశించిననాడు పరమాత్మానుభవం లభించినదన్నమాటే.

రాగద్వేషాలు నశించినా, భగవత్సాక్షాత్కారం లభించనివారు ఉన్నారు. భగవంతుడు అంటే సత్యమే అనీ, ధర్మమే భగవంతుడు అనీ వారి ఉద్దేశ్యం. యథార్థానికి పరమాత్మకు సగుణ సాకార నిర్గుణ నిరాకార స్థితులు రెండూ శాశ్వత సత్యాలే. కొందరు సగుణ సాకార తత్త్వం నశించిపోతుంది అనుకుంటారు. వారికి సకల కల్యాణగుణాలతో, దివ్యమంగళ విగ్రహంతో

భగవానుడు సాక్షాత్కరిస్తాడు అన్న విశ్వాసం ఉండదు. మరి పరిపూర్ణ భగవత్సాక్షాత్కారం వారికి ఎలా అవుతుంది ?

నువ్వు రాగద్వేషాలు ఏమాత్రం లేకుండా సాధన చెయ్యటంతో పాటు, "పరమాత్మ సకల కల్యాణ గుణ సంపన్నుడు, దివ్యమంగళ విగ్రహుడు" అన్న విశ్వాసాన్ని పరిపూర్తిగా కలిగి ఉండు. పరమాత్మ సాక్షాత్కారం కావాలి అన్న కాంక్షను తీవ్రమూ, తీవ్రతరమూ, తీవ్రతమమూ చేసుకో. మిగిలిన సాధన అంతా తపస్సుకి శరీరం అయితే, పరమాత్మను గురించిన ఈ భావం - విశ్వాసం - ప్రాణం. ప్రాణం లేనిదే శరీరం ఏమీ చెయ్యలేదు; శరీరం లేనిదే ప్రాణం ఉపయోగించదు. ఈ విషయాన్ని సర్వకాల సర్వావస్థలయందూ దృఢంగా జ్ఞాపకం ఉంచుకో.

రాగద్వేషాలు కలిగి ఉండటంచేత, ఎంత తపస్సు చేసినా పరమాత్మ సాక్షాత్కారం కలుగలేదు దుర్వాసాదులకు. రాగద్వేషాలు పూర్తిగా పోయి, మహర్షులతో సమానమైన చిత్తశుద్ధిని సంపాదించినా, భగవంతుడు కల్యాణగుణ సహితుడు అనీ దివ్యమంగళ విగ్రహుడు అనీ విశ్వాసం ఉండకపోవటంచేత పరిపూర్ణ

పరమాత్మానుభవం లభించదు కొందరికి రాగద్వేషాలు నశించి, పరమాత్మయందు విశ్వాసం లేకపోయినా, పరమాత్మయందు విశ్వాసం ఉన్నప్పటికీ ఏమాత్రం రాగద్వేషాలు ఉన్నా, పరమాత్మ సాక్షాత్కారం లభించదు. ఈ విషయంలో మెలకువతో సాధన చెయ్యాలి. లేకపోతే, ఎంతశ్రమపడినా, పొందవలసిన ఫలాన్ని పొందలేడు సాధకుడు. కనుక, భగవంతునియందూ, ఆయన కల్యాణగుణములయందూ, పరిపూర్ణ విశ్వాసం ఉంచి, రాగద్వేషాలను నశింపచేసుకోవటానికి తీవ్రప్రయత్నం చెయ్యి.



చాలామంది సాధకులు భగవంతుని స్వరూప గుణ విభవాదులను గూర్చి తమ బుద్ధితో తాము స్వతంత్రంగా ఆలోచిస్తారు. అట్టివారు భగవన్మాయలో చిక్కుకుని భ్రమప్రమాదాలకు లోనవుతారు. భగవంతుని మాయను ఆయన అనుగ్రహం వల్లనే తెలుసుకోవాలి; గత్యంతరం లేదు. అందువల్లే, గీతలో "మమ మాయా దురత్యయా" అని చెప్పాడు కృష్ణపరమాత్మ. 

ఆ కృష్ణపరమాత్మే గీతలో మళ్ళీ ఇలా అన్నాడు -

"తేషాం సతత యుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే"

'ఎవరైతే నన్ను సతతమూ ప్రీతిపూర్వకంగా భజిస్తూఉంటారో, వారికి నన్ను తెలుసుకొనే బుద్ధిని నేనే ప్రసాదిస్తున్నాను'.

సాధకుని భావం ఎలా ఉంటే, ఆ భావానికి అనుగుణంగా సాధనలో ప్రయోజనం సిద్ధిస్తుంది. భావనలో లోపం ఉంటే, ఆ లోపానికి తగినంతగా, పరమాత్మను తెలుసుకొనటంలో సాధకుడు భ్రమప్రమాదాలకు లోనయే అవకాశం ఉంటుంది.

ఈ విషయాన్నే కృష్ణపరమాత్మ

"యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్
తం త మేవైతి కౌంతేయ! సదా తద్భావ భావితః"

'ఎవడెవడు ఏ యే భావాన్ని స్మరిస్తూ శరీరాన్ని వదలుతాడో, ఆ యా భావానికి అనుగుణమైన స్థితినే వాడు పొందుతాడు' అని వివరించాడు గీతలో.

మానవుడు ఎప్పుడూ ఏ భావంతో ఉంటాడో, ఆ భావంతోనే వాని ప్రాణ మనో బుద్ధీంద్రియాలు అన్నీ నిండి ఉంటాయి. ఈ దేహాన్ని విడిచిన తరువాత మాన

వుకు ప్రాణ మనోబుద్ధీంద్రియాల ద్వారా నే ప్రయాణిస్తాడు కనుక, అతని భావానుగుణమైన ప్రయోజనాన్నే పొందు తాడు. కనుక, సదా భగవంతుణ్ణే స్మరించుకుంటూ, శాస్త్ర విహితమైన కర్మ చేసేవాడు భగవంతుణ్ణి పొందితీరతాడు.

అయితే, భగవంతుణ్ణి స్మరించాలి అంటే, భగవ త్స్వరూప గుణాదుల యథార్థ స్వరూపం తెలిసి ఉండాలి గదా! తెలిసిన తరువాత భావించటమా, భావించిన తరువాత తెలియటమా? తెలియందే ఎలా భావించటం? భావించకపోతే ఎలా తెలుస్తుంది?- ఇది గడ్డు సమస్యగా ఉంటుంది సామాన్యంగా.

దీనికి సమాధానంగా

"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః"

'జ్ఞానులూ, తత్త్వదర్శులూ అయిన మహాత్ముల సన్నిధికి వెళ్ళి, ప్రణిపాత పరిప్రశ్న సేవలద్వారా జ్ఞానాన్ని' పొందు. ఆ జ్ఞానాన్ని వారు ఉపదేశిస్తారు' అని చెప్పాడు కృష్ణపరమాత్మ.

అయితే, "నన్ను ఎవడు ప్రీతిపూర్వకంగా భజించుకుంటూ ఉంటాడో, వానికి నన్ను తెలుసుకునే

బుద్ధిని నేనే ప్రసాదిస్తాను" అని పరమాత్మ చెప్పాడు గదా అనవచ్చు నిజమే - జ్ఞానులూ - తత్త్వదర్శులూ అయిన గురువులచెంతచేరి ఆశ్రయిస్తే వారు అనుగ్రహించి, భగవంతుని స్వరూపగుణ విభవాదులను గూర్చి యథాతథంగా ఉపదేశిస్తారు. వారి ఉపదేశానుసారం సంపూర్ణ విశ్వాసంతో ప్రీతిపూర్వకంగా భగవంతుణ్ణి భజించుకుంటూ ఉంటే, భగవంతుడు అనుగ్రహించి, తనను తెలుసుకునే బుద్ధిని ప్రసాదిస్తాడు. మొదట కలిగింది సామాన్య జ్ఞానం అయితే, ఇప్పుడు కలిగేది అనుభవ జ్ఞానం. అనుభవజ్ఞానం గురుపరంపర ద్వారా మాత్రమే లభిస్తుంది. ఇక సాధకునికి భగవదనుభవం కలిగిందన్నమాటే.

బాబూ! ఇప్పటికే ఈ లేఖ పెద్దదైంది. ఇంకా సందేహాలుంటే వ్రాయి. వీలుచూచుకుని సమాధానం వ్రాస్తాను. ప్రస్తుతం నా మనస్సు అనేక విషయాలను గూర్చి ఆలోచిస్తోంది. గోవధ నిషేధాన్ని గురించి చాలా ఆందోళనలు సాగుతున్నాయి. ఎందరో పెద్దలు ఆమరణ నిరాహారదీక్ష కూడా చేస్తున్నారు. వీటికి సంబంధించిన ఆలోచనలతో తొందరలో వ్రాస్తాను.

ఆశ్రమ గ్రంథాలయ పుస్తకాలను ఇంటికి తీసుకు వెళ్ళి చదవటానికి అనుమతి ఇవ్వమనికోరుతూ వ్రాశావు. నీకు ఎప్పుడూ అనుమతి ఉంటుంది. ఏపుస్తకాలు కావా లన్నా, తీసుకువెళ్ళి చదువుకో.

అందరికీ హృదయపూర్వక శుభాశీస్సులు.

ఇట్లు
సదా మీ మేలుకోరు
సీ తా రా ం

## 5

శ్రీరస్తు: చిరంజీవి............కి:
ప్రేమపూర్వక నారాయణస్మరణములతో
ఆశీర్వదించి: ఉభయకుశలోపరి:

ప్రియమైన బాబూ!

నీలేఖ అందింది. అందులో ఒకచోట "పండితులు కూడా ఇటువంటి పొరపాట్లు చేస్తారేమిటి?" అని వ్రాశావు.

పండితులకు ఎన్నడూ పొరపాట్లు ఉండవు. పండితులు చేసినవి పొరపాట్లుగా ఇతరులకు తోచినా, అది చూచేవారి పొరపాటేగాని పండితులది కాదు. అయితే,

పండితుడు అంటే ఎవడో, ఎట్టివాడో తెలుసుకుంటేగాని నేను పైన వ్రాసిన విషయం పూర్తిగా అర్థంకాదు.

కృష్ణపరమాత్మ గీతలో పండితులు అంటే ఎవరో చక్కగా వివరించాడు మూడు సందర్భాల్లో.

"గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః"

"చచ్చినవారిని గురించిగాని, బ్రతికి ఉన్నవారిని గురించిగాని పండితులైనవారు దుఃఖించరు"

చచ్చేది దేహమేకాని ఆత్మకాదు కనుక, దేహాత్మ భ్రాంతి విడిచి, దేహతత్త్వాన్ని తృణీకరించి, ఆత్మ తత్త్వాన్ని అనుభవంలోకి తెచ్చుకున్నవారు దుఃఖించరు. కనుక, దేహాత్మ భ్రాంతిని విడిచి, ఆత్మతత్త్వాన్ని అనుభవంలోకి తెచ్చుకున్నవారే పండితులు అని కృష్ణ పరమాత్మ నిర్ణయం.

"విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
సునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శనః"

'విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణుని యందూ, పవిత్రమైన గోవునందూ, మహోన్నతమైన ఏనుగునందూ, పరమ నీచమైన కుక్కయందూ, అట్టి కుక్కను వండుకొని తినేవానియందూ కూడా పండితులు సమదృష్టి కలిగి ఉంటారు.'

సమదృష్టి అంటే సమానమైన ఆదరభావం అని మాత్రమే కాక, సమః అంటే పరమాత్మ కనుక, సర్వము నందూ పరివ్యాప్తమై ఉన్న పరమాత్మ తత్త్వాన్ని చూడ గలగటం - భావించగలగటం - అనికూడా చెప్పుకోవాలి. "ఈశావాస్య మిదగ్ంసర్వం యత్కించ జగత్యాంజగత్" అన్న ఈశావాస్యోపనిషత్తు ఉపదేశాన్ని అవగతం చేసు కుని, ఆచరణలో ఉంచుకొనేవారే పండితులు.

"యస్య సర్వే సమారంభాః కామసంకల్ప వర్జితాః
జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః"

'ప్రతిఫలకాంక్షగాని, తాను చెయ్యాలి అన్న వ్యక్తిగత సంకల్పంగాని లేక, కేవలం పరమాత్మ చేతిలో పరికరమాత్రులై, పరమాత్మ సంకల్పంవల్ల మాత్రమే కర్మలు చేస్తున్నవారూ, జ్ఞానాగ్నియందు సర్వకర్మలనూ- అంటే కర్తృత్వాభిమానాన్నీ, ఫలాసక్తినీ- దగ్ధం చేసిన వారూ పండితులు అని పెద్దలు అంటారు.'

మొత్తంమీద తేలిన సారాంశం ఏమంటే, దేహాత్మ భ్రాంతిని విడిచి, ఆత్మతత్త్వాన్ని అనుభవంలోకి తెచ్చుకొనటంవల్ల, చచ్చినవారిని గురించిగాని, బ్రతికి ఉన్నవారిని గురించిగాని ఏ సందర్భంలోనూ ఏవిధమైన దుఃఖమూ పొందనివాడూ; సర్వులయందూ సర్వత్రా

పరమాత్మ తత్త్వాన్నే దర్శించేవాడూ; ప్రతిఫలకాంక్షా, కర్తృత్వాభిమానమూ లేక, కేవలం పరమాత్మ చేతిలో పరికరంగా పరిణమించినవాడూ పండితుడు. ఇది వారూ వీరూ చేసిన నిర్ణయం కాదు - సాక్షాత్తు కృష్ణపరమాత్మ చేసిన నిర్ణయం.

ఇక, పండితుడు అంటే లోకంలో ఉన్నభావం ఏమిటి?

సంస్కృతంలోనో, మరొక భాషలోనో ప్రావీణ్యం ఉన్నవారిని పండితులు అంటోంది లోకం. శాస్త్ర పరిచయం బాగా ఉన్నవారిని పండితులు అంటోంది లోకం. నిజమైన పండితులకు ఇవికూడా - భాషాప్రావీణ్యమూ, శాస్త్ర పరిచయమూ కూడా - ఉంటే ఉండవచ్చు. కాని, కేవలం ఇవి మాత్రమే ఉండి పై లక్షణాలు లేనివారిని పండితులు అని వ్యవహరించటం ఉచితంకాదు. భాషాప్రావీణ్యమూ, శాస్త్రపరిచయమూ లేకపోయినా, పైన పేర్కొన్న లక్షణాలు ఉంటే, వాడు పండితుడే. మరొక విషయం - పై లక్షణాలు లేకుండా, కేవల భాషా ప్రావీణ్యమూ శాస్త్ర పరిచయమూ మాత్రమే ఉన్నవాడు, ఉపయోగం లేకపోగా, వ్యర్థమైన వాదోపవాదాలకు దోహదమై, అహంకారం పెరిగి అధోగతికి త్రోవ తీసే ప్రమాదం ఉంది. ఆధ్యాత్మికతత్త్వం ఎప్పుడూ

వాదోపవాదాలకు లొంగేదీ కాదు, తేలేదీకాదు. కనుక, ఇట్టి విషయాల్లో జాగ్రత్తగా ఉండాలి.

బాబూ! ఏదో వ్రాశాను - ప్రస్తుతానికి ఇంతే. త్వరలో మళ్ళీ వ్రాస్తాను.

అందరికీ శుభాశీస్సులు.

సర్వజన శ్రేయోఽభిలాషి
సీతారాం

## 6

శ్రీ సీతారామాశ్రమము

శ్రీరస్తు: చిరంజీవి..............కి:
ప్రేమపూర్వక నారాయణస్మరణములతో
ఆశీర్వదించి: ఉభయకుశలోపరి:

ప్రియమైన బాబూ!

నీలేఖ అందింది. అన్ని విషయాలూ అర్థంచేసుకున్నాను.

నీ లేఖలో "నేను ఎవరికి ఎంత చేసినా, అందరూ అసంతృప్తి పొందుతూనే ఉన్నారు. కారణం నాకు తెలియటంలేదు" అని వ్రాశావు. వారి అసంతృప్తి మాట

అలా ఉంచి, ముందు నీ అసంతృప్తి గోచరిస్తున్నది నీ లేఖలో.

సామాన్యంగా అందరికీ ఏదోవిధమైన అసంతృప్తి ఉండనే ఉంటుంది. దాన్ని పట్టించుకోకుండా, చెయ్య వలసిన సేవ చెయ్యటమే నీ బాధ్యత. ఎంతచేసినా అసం తృప్తి పొందుతూనే ఉన్నారు అని ఇతరులను గురించిన అసంతృప్తి నీకెందుకు? నీ అసంతృప్తిని నువ్వు గమనించ లేక, ఇతరుల అసంతృప్తిని మాత్రమే గమనించి బాధ పడటా వెందుకు? వారి అసంతృప్తికి కారణం తెలియ దని వేదనచెందుతా వెందుకు? వారి అసంతృప్తికి కారణం తెలుసుకోవటానికి తపోమహిమా, యోగ సిద్ధులూ ఏమీ అక్కరలేదు - శాస్త్ర ప్రపంచజ్ఞానం ఉంటే చాలు.

నువ్వు చేసిన సహాయం చాలక వాళ్ళు అసంతృప్తి పొందవచ్చు; నువ్వు చేసిన సహాయం వారి ఇష్టప్రకారం ఉండకపోవటంచేత అసంతృప్తి పొందవచ్చు; నువ్వు చేసిన సహాయం వారి ఇతరప్రయత్నాలకూ, కాంక్షలకూ ప్రతిబంధకం అవటంచేత అసంతృప్తి పొందవచ్చు; అసలు నువ్వు చేసే సహాయమే వారికి ఇష్టంలేకపోవటం చేతా, ఆ విషయం నీకు చెప్పే వీలులేకపోవటంచేతా

అసంతృప్తి పొందవచ్చు; నువ్వు చేసే సహాయం వారికి ఇష్టమే అయినా, లోకభయంచేత- ఎవరేమనుకొంటారో అనే భయంచేత - అసంతృప్తి పొందవచ్చు. ప్రస్తుతానికి ఇవి చాలు - వెనుకటి జన్మల వరకూ పోనక్కరలేదు. కనుక, ఎవరూ ఎవరికీ ఏవిధమైన అసంతృప్తీ కలగని విధంగా సహాయం చెయ్యలేరు. ఏదో శక్తి ఉన్నంతలో తోచినంతలో సహాయం చేశారులే అని సహాయం పొందినవారు తృప్తిపడాలేగాని, వేరే మార్గం లేదు.

తాము చెయ్యదలుచుకున్న సహాయం పరమార్థ దృష్టితో - సేవాభావంతో - చేస్తే తప్ప, సహాయం పొందినవారి విషయం అలా ఉంచి, సహాయం చేసిన వారికి కూడా అసంతృప్తి కలగక తప్పదు.

సామాన్యంగా ప్రతివ్యక్తిలోనూ రాగద్వేషాలూ అహంకార మమకారాలూ తప్పకుండా ఉంటాయి. ఆ స్థితిలో తన బాధ్యతలు ఏవో సరిగా గుర్తించలేక, తనకు అధికారం లేకపోయినా ఆ బాధ్యతలను విస్తరించుకోవటమో, కుంచింపచేసుకోవటమో చేస్తాడు మానవుడు. తనకు లేని బాధ్యతలను కూడా నెత్తినవేసుకోవటమో, ఉన్న బాధ్యతలను కూడా విడిచిపెట్టటమో చేస్తాడు. ఆ చెయ్యటం కూడా స్వార్థభావనతో చేస్తాడు. అందుచేత,

వాడికి ఇక్కడ దుఃఖమే ఫలం ; భగవద్రాజ్యంలో శిక్ష కూడా అనివార్యం. మానవ ప్రభుత్వంలో అయినా, బాధ్యతలను తనంత తానుగా విస్తరించుకున్నా, కుంచింప చేసుకున్నా శిక్ష తప్పదు కదా !

రాగద్వేషాలతో, అహంకార మమకారాలతో నిండి ఉన్న బుద్ధి ద్వారా ఎవడూ ధర్మస్వరూపాన్ని గ్రహించలేడు. పైపెచ్చు తనకు తోచిందే ధర్మం అనుకుంటాడు. అలా అని ఇతరులకూ వేరువేరుగా తోచవచ్చుగదా అంటే, ఆ విషయం అంగీకరించడు. తనకు తోచినదాన్నే అందరూ అంగీకరించాలి అంటాడు. ప్రపంచంలో ఏదైనా ఎప్పుడైనా సర్వమూ తన ఇష్టానుసారమే జరగాలి అన్న భావం ఉన్ననాడు, అసంతృప్తికీ దుఃఖానికీ అంతకు మించిన కారణం ఏమి కావాలి? ఏదో పొరపాటు చెయ్యటం వల్ల మనం ఈ లోకంలో పుట్టాం. ముళ్ళపొదలోనుండి తప్పించుకున్నట్టు ఈ లోకం నుండి ఏదోవిధంగా తప్పించుకుని, ఈ లోకంలో పుట్టటానికి కారణమైన పొరపాటు మళ్ళీ చెయ్యకుండా బయటపడటమే మనకు కావలసింది.

నిజానికి ఎవరూ ఎవరికీ ఉపకారంగాని, అపకారం గాని చెయ్యలేరు. ఎవరికి ఏది జరిగినా, వారి వారి

ప్రారబ్ధానుసారమే జరుగుతుంది. ఈ నాటి అనుభవానికి కారణమైన కర్మ గత జన్మలోనిది- లేక గతజన్మలలోనిది. ఈ జన్మలో చేసేకర్మ పై జన్మలో- లేక పై జన్మలలో- అనుభవంలోకి వస్తుంది. కనుక, తన క్రియాశక్తిని దుర్వినియోగం చేసుకోక, ప్రవర్తనను నీతియుక్తంగా తీర్చిదిద్దుకొని పరమార్థం పొందటం మానవుని విధి.

పరమార్థం పొందాలి అంటే, నీతియుతమైన ప్రవర్తన కలిగి ఉండి, హృదయాన్ని విశుద్ధ ప్రేమతో నింపుకొని, పరమాత్మయందే మనస్సును లగ్నంచేసి, మానవసేవే మాధవసేవ అన్న పవిత్ర భావంతో ఇతరులకు సేవచెయ్యవలసిందే. సేవ చెయ్యాలి అంటే దయాగుణం ఇత్యాది సద్గుణాలను కలిగిఉండాలి. ఇతరులకు సేవచేసి మనం తరించటం కోసం మనం కలిగి ఉన్న గుణాలకు అహంకరించటంగాని, ఇతరులు మనకు కృతజ్ఞత చూపాలి అని ఆశించటంగాని ఎంత తెలివితక్కువ! అట్టి భావన ఉన్ననాడు, పరమార్థం శూన్యంకావటమే కాక, ఈ లోకంలో కూడా దుఃఖమే ఫలం. తమ హితం కోరుకొనే ప్రతివారూ ఈ రహస్యం తెలుసుకొనితీరాలి.

మిగిలిన విషయాలను గురించి మరొకమారు వ్రాస్తాను. నేను వ్రాసిన ప్రత్యక్షరమూ జాగ్రత్తగా

చదువుకొని, మననం చేసుకో. బాబూ! ఇతరులవైపు కాక, నీవైపు నువ్వు చూచుకొనే అభ్యాసం చెయ్యి.

అందరికీ శుభాశీస్సులు.

సర్వజన శ్రేయోఽభిలాషి
సీతారాం

# 7

శ్రీరస్తు: చిరంజీవి.............కి:
ప్రేమపూర్వక నారాయణస్మరణములతో
ఆశీర్వదించి: ఉభయకుశలోపరి:

ప్రియమైన బాబూ!

నీ లేఖా, నీ స్నేహితుని లేఖా కూడా ఇప్పుడే అందాయి. రెండు లేఖలూ శ్రద్ధగా చదివాను. మీ లేఖలను చూడగానే మిమ్మల్ని చూచినంత ఆనందం అయింది. మీ ఉభయులకూ పరిపూర్ణ ఆరోగ్యం ప్రసాదించ వలసిందిగా భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను. మీ లేఖలలోని సందేహాలన్నిటినీ దృష్టిలో ఉంచుకొని ఈ లేఖ వ్రాస్తున్నాను.

మానవజన్మ లభించింది కేవలం మోక్ష సంపాదన కొరకు. అనివార్యమైన ప్రారబ్ధకర్మను అనుభవిస్తూ

మోక్షంకోసం ప్రయత్నించటమే మానవజన్మ యొక్క పరమలక్ష్యం.

ప్రారబ్ధకర్మను అనుభవించటం అనివార్యమే అయినా, ప్రారబ్ధకర్మలో లేకపోతే, ఎంత ప్రయత్నించినా అనుభవించలేం అనీ, ప్రారబ్ధకర్మలో ఉంటే, ప్రయత్నం చెయ్యకపోయినా లభించితీరుతుంది అనీ తెలిసినా, తన ఇష్టానుసారం సంపాదించటానికీ, అనుభవించటానికీ ప్రయత్నిస్తారు వెయ్యికి తొమ్మిదివందల తొంభైతొమ్మిది మంది. పండితులం అనుకొనేవాళ్ళుకూడా, ప్రారబ్ధకర్మానుసారం జరిగేవాటి విషయంలో కూడా, వారి క్రియాశక్తిని వ్యర్థంచేసుకుంటున్నారు. కాక, తెలిసో, తెలియకో దుర్వినియోగం చేసుకోవటం కూడా కద్దు. కేవల శాస్త్రజ్ఞానం మానవుణ్ణి ఏం చెయ్యగలదు!

తన ప్రయత్నంవల్ల ప్రారబ్ధకర్మ మారకపోగా, దాన్ని మార్చుకోవటానికి తాను చేసే ప్రయత్నం పాప పుణ్య రూపంగా ఆగామి అయి కూచుంటుంది. ఇది సంచితంలో కలిసి మళ్ళీ జన్మపరంపరకూ, ఆ జన్మలలో అనుభవానికీ కారణం అవుతుంది. తెలియనివారి విషయం అలా ఉంచి, తెలిసినవార మనుకొన్నవారు కూడా ఇక్కడే పొరపడుతున్నారు ఆచరణలోకి వచ్చే సరికి.

మానవుడు తన ప్రయత్నాన్ని - క్రియాశక్తిని - ప్రారబ్ధ కర్మకు సంబంధించిన విషయాల్లో వినియోగించుకొనటంలో రాగద్వేషాలకూ, అహంకార మమకారాలకూ లోనై, తన శాస్త్రజ్ఞానాన్నికూడా ఆ సమయంలో విస్మరించి, సతమత మవుతున్నాడు. ఇదికూడా ఆగామిగా పరిణమిస్తోంది. ఇదంతా చూస్తే, మాయ ఎంత బలవత్తరమైంది అనిపిస్తుంది. అందువల్లే, నారద భగవానులు "కస్తరతి కస్తరతి మాయాం?" అన్నారు. గీతలో కృష్ణపరమాత్మ "మమ మాయా దురత్యయా" అన్నాడు. పరమాత్మే అలా అంటే ఇక మనగతి ఏమిటి అన్న భయం కలగవచ్చు. పరమాత్మ అలా అనటంలో, తన మాయను ఎవరూ స్వశక్తిమీద ఆధారపడి జయించలేరు అనేగాని, అసలు ఉపాయమే లేదనికాదు.

అందువల్లే,

"మామేవ యే ప్రపద్యంతే
మాయామేతాం తరంతి తే"

అన్నాడు కృష్ణపరమాత్మ మళ్ళీ.

పరమాత్మ మాయను జయించాలి అంటే ఆయనను శరణాగతి చెయ్యటం తప్ప ఇంకొక మార్గం లేదు. అయితే, సరాసరిగా పరమాత్మను శరణాగతి చెయ్యటం

సాధ్యం అవుతుందా అంటే కాదు. జ్ఞానులూ, తత్త్వదర్శులూ అయిన మహాత్ములను - భగవదనుభవంకల మహాత్ములను - ప్రణిపాతంచేతా, పరిప్రశ్న చేతా, సేవ చేతా శరణాగతి చెయ్యాలి అని గీతాచార్యుని ఆదేశం.

ఈ విషయం దృష్టిలో ఉంచుకొనే,
"తస్మిం స్తజ్జనే భేదాభావాత్" అనీ,
"తదేవ సాధ్యతాం తదేవ సాధ్యతాం" అనీ

అన్నారు నారదభగవానులు తమ భక్తి సూత్రాలలో. దీన్నే సంప్రదాయం తెలిసిన పెద్దలు ఆచార్యాశ్రయణం అన్నారు. ఆచార్యునికి కాయేన, మనసా, వాచా అనుకూలంగా ఉండటమే ఆచార్యాశ్రయణం.

పరమాత్మ కేవలం నిగ్రహానుగ్రహ స్వరూపుడు. ఆ పరమాత్మే ఆచార్యరూపంలో అవతరించినప్పుడు నిగ్రహం ఏమాత్రమూ లేని అనుగ్రహైక స్వరూపుడు. జీవులు శిక్షణపొంది వస్తేగాని రక్షించడు పరమాత్మ. జీవులకు శిక్షణ ఇచ్చి రక్షిస్తాడు ఆచార్యుడు.

సముద్రంలో నీరు ఉంటుంది. కాని, అది త్రాగటానికి యోగ్యంకాదు. ఆ నీటిలో ఉప్పు ఉండటంవల్ల, అది నీరే అయినా, దానిలో మాధుర్యం ఉండదు. ఆ నీరే

మేఘం ద్వారా లభించినప్పుడు, ఆ నీటిలోని మాధుర్యం అనుభవంలోకి వస్తుంది.

అలాగే, కేవలం పరమాత్మ ద్వారా లభించే అనుగ్రహంలో నిగ్రహం మిళితమై ఉంటుంది. అందువల్ల, రక్షణ అనుభవంలోకిరాదు. ఆ అనుగ్రహమే ఆచార్యుని ద్వారా లభించినప్పుడు, దానిలో నిగ్రహస్పర్శ కూడా ఉండదు. అప్పుడు అనుగ్రహం యొక్క వైభవం అనుభవంలోకి వచ్చి రక్షణ లభిస్తుంది.

అందువల్ల, పరమార్థం లభించాలి అంటే ఆచార్యుణ్ణి ఆశ్రయించాలి. ఆచార్యుణ్ణి ఆశ్రయించటం అంటే ఏమిటి, ఆశ్రయించిన తరువాత శిష్యుని బాధ్యత ఏమిటి అని సందేహం కలగవచ్చు.

పరమార్థాన్ని- మోక్షాన్ని- ఎవరూ స్వశక్తివల్ల సంపాదించలేరు. కేవలం ఆచార్యానుగ్రహంవల్ల మాత్రమే అది లభిస్తుంది. "ఉతామృతత్వ స్యేశానః" అని పురుష సూక్తంలో చెప్పబడి ఉన్నట్లు, మోక్షానికి అధిపతి అయిన పరమాత్మ అనుగ్రహంవల్లే మోక్షం లభించాలి. పరమాత్మానుగ్రహం లభించటం అంటే ఆచార్యానుగ్రహం లభించటమే.

పరమాత్మానుభవం కల మహాత్ముడే ఉత్తమ ఆచార్యుడు. అట్టి మహానుభావుల్ని గురించే

"అహం భక్త పరాధీనో
హ్యస్వతంత్ర ఇవ ద్విజ !" అనీ,
"అనువ్రజామ్యహం నిత్యం
పూయేయ ఇత్యంఘ్రిరేణుభిః" అనీ

చెప్తున్నాడు కృష్ణ పరమాత్మ. కనుక, అట్టి మహాత్ముల కోరిక తీర్చకుండా ఉండలేడు పరమాత్మ. అయితే, అట్టి మహాత్ములకు కూడా కోరికలు ఉంటాయా అని సందేహం కలగవచ్చు. బ్రహ్మలోక పర్యంతములైన కామోపభోగములయందు కూడా ఏమాత్రమూ కోరిక ఉండదు వారికి. అలా భోగములయందు కోరిక ఉన్ననాడు అసలు పరమాత్మానుభవమే కలగదు.

అయితే, ఆ స్థితిలోని మహాత్ములకు కూడా ఒక కోరిక ఉంటుంది- తాము అనుభవించినట్లు, ఇతరులు కూడా పరమాత్మను అనుభవించగలగాలి అని. ఇతరములైన కోరికలు ఏమాత్రమూ ఉండవు. కనుక అట్టి మహాత్ముల అనుగ్రహం పొందటానికి సాధకుడు వారికి ఏమీ చెయ్యనక్కరలేదు. ఏమి చేసినా, తన ప్రయోజనంకోసం చెయ్యవలసిందే. అయిన ప్పుడు, వారి అనుగ్రహం పొందటం ఎంతో సులభం

కదా! కాయేన మనసా వాచా వారికి అనుకూలంగా ఉంటే, వారి అనుగ్రహం లభించిందన్నమాటే.

మానవునికి హృదయం అంటూ ఉంది. కనుక, ప్రేమ సహజంగా ఉంటుంది. ఆ ప్రేమను ప్రపంచంవైపు ప్రవహింపజేసుకుంటే, మమకారంగా పరిణమించి బంధనకారణం అవుతుంది; దుఃఖహేతువౌతుంది. ఆ ప్రేమనే పరమాత్మవైపు ప్రసరింపజేస్తే, భక్తిగా పరిణమించి, మోక్షానికి కారణం అయి, ఆనందాన్ని లభింపజేస్తుంది. కనుక, మోక్షం కావాలి అని కోరుకునేవారు అందరూ తమ ప్రేమను పరమాత్మవైపు త్రిప్పాలి. అంటే పరమాత్మకు అభిన్నుడయిన ఆచార్యునివైపు త్రిప్పాలి. ప్రేమను ఆచార్యునివైపు పరిపూర్ణంగా త్రిప్ప గలిగిననాడు, శారీరకంగానూ, మానసికంగానూ, వాచికంగానూ ఆచార్యునికి అనుకూలంగా ఉండితీరతాడు సాధకుడు.

అలాకాక, ప్రేమలో కొంతభాగాన్ని మాత్రమే ఆచార్యునివైపు త్రిప్పగలిగితే, ఆ ప్రేమయొక్క మోతాదును బట్టి, ఆనుకూల్యం ఉంటుంది. యథార్థంగా ప్రేమ లేక, పైకి ఉన్నట్లు కనపరిస్తే, అది కపటం అవుతుంది. ఆ కపటమే ఆనుకూల్యంలోకూడా మిళితం అవుతుంది.

కొంతమందికి యథార్థమైన ప్రేమ ఉన్నా, దానికి తగినట్టు అనుకూల్యం క్రియారూపంలో చూపించలేక పోవచ్చు. దానికి కారణం ప్రేమలో కపటం ఉండటం వల్ల కాదు - పరిపూర్ణ వైరాగ్య లేకపోవటంవల్ల; ప్రాపంచికములైన ఇరుకులూ, ఇబ్బందులూ భరించలేక పోవటంవల్ల.

ఆచార్యుడు పరిపూర్ణ భగవదనుభవం కలవాడు. అందుచేత, కేవలం అనుగ్రహైకస్వరూపుడు. అట్టి ఆచార్యునితో వ్యవహరించవలసివస్తే పేచీలూ బాధలూ ఉండవు. సాంసారికములైన బాధ్యతలను సరిగా నిర్వహించకపోతే ఇరుకులూ, ఇబ్బందులూ కలుగుతాయి. బాధ్యతా నిర్వహణంలో - అవి సాంసారికములైన బాధ్యతలు గాని, లేక పారమార్థికములైన బాధ్యతలుగాని - ఏవో సాకులు చెప్పి తప్పించుకుంటూ ఉంటే, అది కపటమే అవుతుంది. ఈ కపటానికి కారణం వారు చూపించే ప్రేమలోనే - భక్తిలోనే - బీజరూపంగా ఉంటుంది.

ఇంతకూ తేలిన సారాంశం ఏమంటే, ప్రేమ పరిపూర్ణంగా ఉన్నా లేక ఏమాత్రమో కొరత ఉన్నా, ఆ ప్రేమకు తగినంత అనుకూల్యం క్రియారూపంలో చూపించలేకపోవచ్చు. కాని, మానసికంగానూ, వాచికం

గానూ, ప్రాతికూల్యం ఏమాత్రం ఉండదు. ప్రాతికూల్యం లేకుండా, ఆనుకూల్యం చూపించగలిగితే, ఆ ఆనుకూల్యం క్రమక్రమంగా పరిపూర్ణం అవుతుంది. అప్పుడు పూర్తిగా క్రియారూపంలోకి వస్తుంది.

మానసికమైన ఆనుకూల్యం అంటే, మనస్సులో ఎప్పుడూ, ఎక్కడా, ఎంతమాత్రమూ గురువునందు - ఆచార్యునియందు - ప్రతికూలభావంగాని, విమర్శనా భావంగాని రాకుండా, చూచుకోవాలి. ఎప్పుడూ అనుకూల భావాలే ఉండేట్టు చూచుకోవాలి.

వాచికమైన ఆనుకూల్యం అంటే, మాటలలో ఎప్పుడూ ఎక్కడా ఎంతమాత్రమూ ఆచార్య వ్యతిరేక సంభాషణలు రాకుండా, అనుకూల సంభాషణలు మాత్రమే వచ్చేట్టు చూచుకోవాలి.

శారీరకమైన ఆనుకూల్యం అంటే, క్రియా రూపంలో ఆనుకూల్యం చూపించటం. శారీరకంగా, ఆర్థికంగా శక్తి ఉన్నంతమేరలో సేవచెయ్యటం. అయితే, కాంక్షలు ఏమీలేక, సదా పరబ్రహ్మ చింతనలో ఉండేవాడు - పరబ్రహ్మానుభవంలో మునిగి ఉండేవాడు- ఇతరుల సేవకై ఎదురు చూస్తాడా, అతనికి ఆ అవసరం ఉంటుందా అంటే, తనను ఆశ్రయించిన శిష్యుని అను

గ్రహించటం కోసమే, శిష్యుడు చేసే సేవను అంగీకరిస్తాడు. అట్టి మహానుభావులు చేసే కర్మలన్నీ లోక కల్యాణానికే ఉపకరిస్తాయి.

బాబూ! మీ సందేహాలలో కొన్నిటికి సమాధానం వ్రాశాను - మిగిలినవాటికి తరువాత వ్రాస్తాను.

అందరికీ శుభాశీస్సులు

సర్వజనశ్రేయోఽభిలాషి.
సీతారాం

# 8

శ్రీ కృష్ణాశ్రమము

శ్రీరస్తు: చిరంజీవి............కి:
ప్రేమపూర్వక నారాయణస్మరణములతో
ఆశీర్వదించి: ఉభయకుశలోపరి:

ప్రియమైన బాబూ!

నీకు నాయందు ఉన్న భక్తి విశ్వాసాలకు ఎంతో ఆనందం అయింది. నీకు ఐహికంగా, పారమార్థికంగా-అన్నివిధాలా భగవదనుగ్రహం లభించాలని హృదయపూర్వకంగా భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

భగవదనుగ్రహం లభించాలంటే గృహస్థాశ్రమాన్ని విడిచిపెట్టనక్కరలేదు. ఐహిక జీవితాన్ని పరమార్థానికి అనుకూలంగా మలుచుకుంటే, గృహస్థాశ్రమంలో ఉన్నా, భగవదనుగ్రహాన్ని పొందవచ్చు. అందుకు ఉపయోగించే కొన్ని అంశాలను ఈ క్రింద వ్రాస్తున్నాను. ఆవిధంగా ఆచరించటానికి త్రికరణశుద్ధిగా ప్రయత్నించు.

గృహస్థునకు ఆశ ఉంటే ఉండవచ్చు. దురాశ మాత్రం ఉండరాదు.

విషయ సుఖాలను పూర్తిగా విడిచిపెట్టనక్కరలేదు- కాని, క్రమబద్ధంగా, న్యాయ్యమైన రీతిలో అనుభవించాలి-

ఏ పని చేస్తున్నా, అది తన పరమార్థానికి అనుకూలంగా ఉండేట్టు- కనీసం ప్రతిబంధకం కాకుండా ఉండేట్టు - చూచుకోవాలి. అలాగే, తన సంభాషణలూ, ఆలోచనలూ- పరమార్థానికి ప్రతిబంధకాలు కాకుండా చూచుకోవాలి. ఈ విషయం నిత్య జీవితంలో అనుక్షణం జ్ఞాపకం ఉంచుకోవాలి.

ఎవరినీ ఏ సందర్భంలోనూ సందేహించరాదు. తొందరపడి ఎవరినైనా సందేహించి, మాట తూలితే, తరువాత నిజం తెలిసినా, ఆ మాటను తీసివెయ్యలేము.

ఆ మాటవల్ల, ఆ వ్యక్తి జీవితంలో మాయని మచ్చ ఏర్పడుతుంది. అందువల్ల, దాని మోతాదుకు తగినంతగా మాట తూలిన వ్యక్తి ఐహికంగానూ, పారమార్థికంగానూ నష్టపోతాడు. అట్టి పొరపాటుకు భగవంతుని సన్నిధిలో సమాధానం చెప్పుకోవలసివస్తుంది. కనుక, తన హితం కోరుకునే ప్రతివాడూ ఈ విషయంలో అత్యంత జాగ్రత్తతో ఉండాలి.

గురువు విషయంలో - కనీసం తనకు శారీరకంగాను, ఆర్థికంగానూ కష్టం కలగనంతమేరకు అయినా - గుర్వాజ్ఞలను శ్రద్ధాభక్తులతో పాటించటానికి సిద్ధంగా ఉండాలి.

బాబూ ! కనీసం ఇంతవరకైనా పాటిస్తే చాలు - ఇది ప్రథమశ్రేణి. ఇవి పాటించిననాడు, భగవంతుని రక్షణ కోరటానికి అధికారం లభిస్తుంది. నా వాళ్ళంతా ఇంతమాత్రమైనా పాటిస్తే, నేను ఈ లోకంలోకి వచ్చిన పని నెరవేరిందని సంతోషిస్తాను. నీకూ, నీ భార్యకూ నాయందు ఉన్న విశ్వాసానికి ఆనందం కలిగింది. మీ శ్రేయస్సుకోరి, మీరు నన్ను సరిగా అర్థంచేసుకోగలరన్న నమ్మకంతో ఇది వ్రాశాను. ఈ ప్రథమశ్రేణి నియమాలు అనే రైలుపట్టాలమీద, జీవితం అనే రైలుబండిని

నడిపిననాడు, ఏ ఒడుదుడుకులూ లేకుండా గమ్యస్థానాన్ని చేరుతుంది. ఈ విషయాన్ని తెలిసి తెలిసి నిర్లక్ష్యం చేస్తున్నారు చాలామంది.

ఏ గ్రామంలో అయినా, నూటికి ఎనభై మంది ఈ నియమాలను స్వభావంగా మార్చుకోగలిగితే, ఆ గ్రామం భూలోకస్వర్గంగా రాణిస్తుంది.

ఈ నియమాలను తు. చ. తప్పకుండా పాటించేవాడు నాకు ప్రియుడు. రజస్తమోగుణాలకు ఎంత మాత్రం పాల్పడకుండా ఈ నియమాలను ఇతరులకు కూడా ప్రచారం చేసేవాడు నాకు ప్రియతముడు.

బాబూ! నువ్వు నాకు ప్రియతముడవు కావాలని నా ఆశ.

అందరికీ శుభాశీస్సులు.

సదా మీ మేలుకోరు

సీతారాం

# 9

శ్రీరస్తు: చిరంజీవి..........కి:
ప్రేమపూర్వక నారాయణ స్మరణములతో
ఆశీర్వదించి: ఉభయకుశలోపరి:

ప్రియమైన బాబూ!

నీకు పరిపూర్ణ భగవదనుభవం కలగాలి అని హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను.

భగవదనుభవం కలగటానికి తగిన యోగ్యతను పొందాలంటే, పరమాత్మ కఠినమైన నిబంధనలేవీ విధించలేదు నిజానికి - మూడు బాధ్యతలను మాత్రం పెట్టాడు - భగవంతుని ఉనికిని గూర్చి, రక్షకత్వాన్ని గూర్చి పరిపూర్ణమైన విశ్వాసం కలిగిఉండాలి. ఎవరి విషయంలోనూ అసూయకూ ద్వేషానికీ పాల్పడకూడదు. భగవంతుణ్ణీ, తదీయులైన సర్వుల్నీ, తదీయమైన సమస్తాన్నీ ప్రేమించాలి. ఈ మూడు బాధ్యతలూ మాత్రం సాధకునికి ఉన్నాయి. ఇవి కూడా ఆయనే కలిగించాలి అంటే, అది వేరు. ఎప్పుడో కలిగిస్తాడు- అప్పటి వరకూ వేచి ఉండాలి. ఈ లక్షణాలు కలిగిన తరువాత మాత్రం భగవదనుభవం

వెంటనే కలిగి తీరుతుంది. ఈ లక్షణాలు కలిగి ఉండాలి అన్న తీవ్ర సంకల్పం సాధకునికి ఉండి, ధ్యాన మనన ముల ద్వారా తన ప్రయత్నం తాను చేస్తూ, భగవన్నామం చేసుకుంటూ, ఆపైన పరమాత్మ మీద భారం వెయ్యాలి గాని, తన వైపునుంచి ఏమీ లేకుండా, అన్నీ ఆయనే చూచుకోవాలి అంటే, అది జరగదు- అసలు జరగదని కాదు- ఎప్పటికో, ఏ జన్మలోనో జరుగుతుంది- మొత్తం మీద పరమాత్మ ప్రతి జీవినీ ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక విధంగా అనుగ్రహించే తీరతాడు- తన అనుభవం ప్రసాదించే తీరతాడు. అయితే, ఇప్పుడే- ఈ జన్మలోనే- భగవదనుభవం కావాలి అంటే మాత్రం పరమాత్మ మనకు పెట్టిన ఈ బాధ్యతను నెరవేర్చవలసిందే.

హృదయంలో పరమాత్మను గురించి తప్ప, ఇతరమైన దేనియందూ, ఏ మాత్రమూ వాంఛ పనికి రాదు. అయితే, సృష్టి సమస్తాన్నీ తిరస్కరించాలా, చీదరించుకోవాలా అంటే, కాదు- సృష్టి సమస్తాన్నీ ప్రేమించాలి- ఆదరించాలి- అయితే, ఆ ప్రేమకూ, ఆదరణకూ సర్వమూ తదీయం- భగవంతునికి సంబంధించింది-అన్న భావం ప్రేరణగా ఉండాలి. అప్పుడు భగవచ్చింతన తప్ప, మరొకటి ఉండదు.

"అనన్యా శ్చింతయంతో మాం" అన్నా,

"అనన్యచేతా స్సతతం

యోమాం స్మరతి నిత్యశః" అన్నా,

ఈ స్థితిని గురించే.

అట్టి స్థితి మనకు వచ్చిందా లేదా అని పరమాత్మ పరీక్ష చేసుకుంటాడు. పరీక్ష అంటే ఆయనకు తెలియక కాదు- మనకు తెలియజెప్పటంకోసం. ఆ పరీక్షలో మనం ఉత్తీర్ణులమైతే సరే, లేకుంటే సిగ్గుపడి, సాధనలో ఇంకా తీవ్రతను సంతరించుకోవాలి.

భగవంతుణ్ణి ప్రేమించాలి అని చెప్పుకున్నాం. అసలు ఆయనను ప్రేమించటం ఎందుకు అంటే, ముక్తి కోసం. ముక్తి అంటే ? విడుదల - ప్రకృతిబంధనం నుండి విడివడటం - అంతేకాదు - ఈ ప్రకృతిలోనే పరమాత్మను దర్శించి, అనుభవించగలగటం - అట్టి పరిపూర్ణ భగవదనుభవమే మన ఏకైక లక్ష్యం.

అయితే, ఆ అనుభవం శారీరకం కాదు, ఆత్మగతం. ఆ విషయాన్ని అనుక్షణం గుర్తు ఉంచుకోవాలి. శరీర స్పర్శతో కలిగే సుఖం సుఖమూ కాదు, ఆనందం ఆనందమూ కాదు - నిజానికి అట్టివాటిని సుఖమూ

ఆనందమూ అని పేర్కొనటం గౌణార్థంలోనే - భగవ దనుభవం కేవలం ఆత్మీయం.

భగవంతుని శరీరం దివ్యమంగళ విగ్రహమూ, అప్రాకృతమూ కదా, అట్టి భగవదనుభవం శరీరగతం అయితే మాత్రం దోషం ఏమిటి అన్న సందేహం రావచ్చు. భగవంతుని శరీరం దివ్యమంగళ విగ్రహమే; అప్రాకృతమే. నిజమే - కాని, మన శరీరం ప్రాకృతమే కదా ? మనం ఆయన అనుభవాన్ని కోరేది ప్రాకృతమైన ఈ శరీరంతోనే కదా! భగవదనుభవం కోరేవారికి శారీరకసుఖం మీద దృష్టి - చివరకు భగవదనుభవ మైనా శరీరగతంగా అనుభవించాలన్న వాంఛ కూడా - పనికిరాదు. అయితే, సాధనకు ఈ శరీరం ప్రధానమైన సాధనం కనుక, మోక్షద్వారమూ, సుదుర్లభమూ అయిన ఈ శరీరం ఉండగానే భగవదనుభవాన్ని పొందాలి అని కోరుకోవాలి. భగవదనుభవానికి ఈ శరీరం ఉపకరణం కానట్టే, ఆటంకమూ కాదు అన్న రహస్యం తెలిసి వ్యవహరించాలి.

అయితే, శారీరకదృష్టి- శరీరంతో అనుభవించాలి అన్న భావం - మనకు ఉన్నదా, లేదా అన్న విషయం తేల్చుకోవటం ఎలా అంటే, ఇది నాది, ఇది ఇతరులది;

వీరు నా వారు, వీరు ఇతరులు- అన్న భేదభావం ఉన్నంత కాలం శారీరక దృష్టి ఉన్నట్టే. వ్యావహారిక సౌకర్యం కోసం ఇది మనది, ఇది ఇతరులది అని వ్యవహరించినా, సర్వమునందూ తదీయదృష్టి - సర్వమూ భగవంతునికి సంబంధించిందే అన్న దృష్టి - ఉండాలికాని, వస్తుదృష్టి ఉండరాదు. అలా వస్తుదృష్టి ఉన్నంతకాలం శారీరక దృష్టి ఉన్నట్టే.

శ్రీరామచంద్ర ప్రభువు అవతరించిన కాలంలో, హనుమన్నా, భరత లక్ష్మణ శత్రుఘ్నులూ, గుహుడూ- ఇత్యాదులు ఆలింగనం పొందారు అంటే, వారెవరికీ శారీరకదృష్టే లేదు. శరీరాభిమానం అసలే లేదు. మరి మహర్షులు ఆలింగనం అర్థిస్తే, ఈ అవతారంలో కాదు, కృష్ణావతారంలో అనుగ్రహిస్తాను అని ప్రభువు అన్నట్టు కృష్ణ రహస్యోపనిషత్తులో ఉంది. ఇందులోని రహస్యమేమంటే, తాము మహర్షులమనీ, తపోనిష్ఠులమనీ అహంకార ఛాయ ఉంది వారికి. అది ఉన్నంతవరకూ శారీరక దృష్టి ఉన్నట్టే. అందుచేతే వారికి అప్పుడు అనుభవం కలగలేదు. ఆ అహంకారం సమూలంగా నశించాక, వారు గోపికలు కాగా, తాను కృష్ణుడై వారిని అనుగ్రహించాడు పరమాత్మ.

ఈ రహస్యం తెలుసుకుని సాధన చెయ్యాలి. సర్వాన్నీ విస్మరించి పరమాత్మను ప్రేమించాలి. ప్రేమించకుండా ఉండలేం కనుక ప్రేమిస్తున్నాం అన్న స్థితికి రావాలి. శారీరకదృష్టి- శరీరంతో అనుభవించాలి అన్న వాంఛ- అణుమాత్రం కూడా ఉండరాదు. ఆ స్థితిని పొందారు కనుకనే గోపికలను ఆదర్శంగా పెట్టుకున్నాం మనం. అందరమూ అట్టి గోపికల స్థితిని అందుకోవాలి.

బాబూ ! మరొకమారు వివరంగా వ్రాస్తాను.

అందరికీ శుభాశీస్సులు.

సర్వజన శ్రేయోఽభిలాషి
సీతారాం

# 10

విజయవాడ

శ్రీరస్తు : చిరంజీవి............కి :
ప్రేమపూర్వక నారాయణస్మరణములతో
ఆశీర్వదించి : ఉభయకుశలోపరి :

ప్రియమైన బాబూ !

నీ ప్రశ్నల ద్వారా వ్యక్తమయిన జిజ్ఞాసకు ఆనందించాను.

భగవంతుని అనుగ్రహం పొందటానికి అర్హులైన వారు కొందరు ఉంటారు. వారి అర్హతకు కారణం ఈ జన్మలోనిది కాని, గతజన్మలోనిది కాని కావచ్చు.

బ్రహ్మాండంలోని ఏ జీవి ఎప్పుడెప్పుడు ఎక్కడెక్కడ ఎన్నెన్ని జన్మలు ఎత్తిందో, ఎలా గడిపిందో ఏమేమి చేసిందో - అంతా భగవంతునికి ప్రత్యక్షమే. జీవునికి తనజన్మలగురించే తెలియనప్పుడు, ఇక భగవంతుని అవతారములను గురించి ఎలా తెలుస్తుంది ?

కొంతమంది గత జన్మలలో, భగవంతునితో సన్నిహిత సంబంధం కలిగి వ్యవహరించటానికి తగిన కర్మ చేసి ఉండవచ్చు. ఈ జన్మలో ఆ విషయం వారికే తెలియక పోవచ్చు; ఆ అర్హతకు తగిన లక్షణాలు కూడా బాహ్యంగా ఈనాడు వారిలో వ్యక్తంకాకనూపోవచ్చు. అయినా, గత జన్మలలోని ఆ కర్మకు ఫలంగా, ఆ అర్హత ను పురస్కరించుకుని, అర్హతకు తగిన సంబంధం తనతో ఉండేట్లు అనుగ్రహిస్తాడు. ఆ అనుభవాన్ని గురించి కొంత వివరించటం అవసరం.

తనకు కలిగిన ఈ సంబంధమూ, సాన్నిహిత్యమూ భగవంతునితోనే అన్న స్పృహా, విశ్వాసమూ జీవునికి ఉంటాయి. అయితే, ఆ విశ్వాసంలో స్పష్టతా, పరి

శుద్ధతా, సమగ్రతా ఏర్పడినప్పుడు, ఆ అనుభవం యొక్క యథార్థస్వరూపం తెలుస్తుంది. ఆ స్వరూపానికి తగిన నిర్మలమైన ఆనందం అనుభవంలోకి వస్తుంది.

విశ్వాసంలో అస్పష్టతా, అపరిశుద్ధతా, అసమగ్రతా ఏమాత్రం ఉన్నా, ఆమేరకు ఆనందాను భూతిలో భేదం ఉండకతప్పదు. ఏది ఎలా ఉన్నా, ఆనందం మాత్రం కలిగితీరుతుంది. ఈభేదాన్ని అనుస రించి, ఆ అప్రాకృతానందం హృదయాంతరాళంలో ఎక్కడో అవ్యక్తంగా మినుకు మినుకు మంటూ ప్రకా శిస్తుంది. అంతరాంతరాల్లోని ఈ అనుభూతి కారణంగా, భగవంతునితో తనకు కల సంబంధాన్ని పురస్కరించుకుని, జరిగిన చర్యలనే - భగవంతుని లీలలనే - మాటిమాటికీ తలుచుకుంటూ ఉంటాడు జీవుడు. ఈ మననం వల్ల క్రమ క్రమంగా మనస్సు భగవంతునిలో లయించటం జరుగుతుంది.

ఈ విషయాలన్నీ బుద్ధితో తర్కించుకుంటే, ఇంకా సందేహాలూ, ప్రశ్నలూ ఉద్భవించి, గందరగోళ పడుస్తాయి. ఎందుచేత అంటే, భగవంతుని చర్యలూ, ఆ చర్యల పరిణామాలూ బుద్ధికి అందేవి కావు. "జన్మ కర్మచ మేదివ్యం" అని ఆయనే చెప్పుతున్నాడు కదా!

మానవుని బుద్ధి అప్పటప్పటి వాతావరణాన్ని బట్టి స్వతంత్రంగానో, శాస్త్రవాక్యాలకు తన అల్పబుద్ధితో తాను చేసుకున్న అన్వయం ఆధారంగానో, ధర్మాధర్మ స్వరూప నిర్ణయం చేస్తుంది. తనను గురించిగాని, ఇతరులను గురించిగాని ఆలోచించేప్పుడు, స్వబుద్ధితో చేసిన ఈ అసమగ్ర ధర్మాధర్మ నిర్ణయాలు ఆధారం చేసుకొనే ఆలోచిస్తాడు.

అలా ఆలోచించటంలో తనవంటి సామాన్యులను గురించిన ఆలోచనలోనే భ్రమ ప్రమాదాలకు ఎంతో అవకాశం ఉంది. ఇక మానవుల శారీరక మానసిక పరిస్థితులపై ఆధారపడి, ఆయా శ్రేణులలోనివారు పై శ్రేణులలోకి వెళ్ళటానికి ఏర్పరచబడిన సాపేక్ష ధర్మాధర్మాలకు - మానవులయొక్క మాత్రమే కాదు, బ్రహ్మాది దేవతలయొక్క స్థితిగతులను అనుసరించి నిర్ణయింపబడిన ధర్మాధర్మాలకు కూడా - అతీతుడైన భగవంతుని లీలలను, స్వబుద్ధితో ఆలోచించి నిర్ణయించిన ధర్మాధర్మముల కొలబద్దతో నిర్ణయించాలి అని ఆలోచించటం చాలా అనుచితం మాత్రమే కాదు - పరిపూర్ణమైన అజ్ఞానానికి నిదర్శనం. అట్టి ఆలోచనే కలిగితే, పురాకృతమైన అదృష్ట విశేషంవల్ల ఈ జన్మలో కలిగే భగవత్సంబంధం

యొక్క అభివృద్ధికి కలిగిన అమూల్యావకాశాలు కూడా చేయిజారిపోవచ్చు.

అందువల్ల, భగవంతుని జన్మలూ - నిజానికి అవి జన్మలు కావు, అవతారాలు - కర్మలూ దివ్యములని విశ్వసించి, భగవన్నామాన్ని స్మరించుకుంటూ ఉండాలి- అంతే. ఇక తిరిగి జన్మ లేక, పరిపూర్ణ భగవదనుభవం - మోక్షం- లభిస్తుంది.

ఇక మరొక శ్రేణి వారు ఉంటారు.

భగవంతుని జన్మలూ కర్మలూ దివ్యములు అన్న విశ్వాసం వారికి ఉంటుంది. ఆయన చర్యలను సామాన్య లౌకిక మర్యాదల కొలబద్దతో కొలిచే అజ్ఞానం లేక పోయినా, ఒక విధమైన హృదయ దౌర్బల్యం ఉంటుంది వారికి - భగవంతునితో ఎలా వ్యవహరిస్తే, ఇతరులు ఏమనుకుంటారో, లౌకికంగా ఏ ఇబ్బందులు కలుగుతాయో అని ఈ భయంతో తమకు చిక్కిన అవకాశాన్ని చేజేతులా జారవిడుచుకుంటారు. అట్టివారికి ఎప్పుడైనా, తమకు కలిగిన అవకాశానికి తగిన వాతావరణం లభించి, ఆ అవకాశం సఫలం కావచ్చు. కృష్ణావతారంలోని ముని పత్నులు అట్టివారే.

అలాకాక, కొందరివిషయంలో జీవితపర్యంతమూ అట్టి అనుకూల వాతావరణం లభించక, ఆ అవకాశం అనంతర జన్మలో సఫలం కావచ్చు. ఈ ఆలస్యానికి - కాల విలంబనానికి - కారణం హృదయదౌర్బల్యమే.

అందువల్లే,

"క్షుద్రం హృదయ దౌర్బల్యం
త్యక్త్వో త్తిష్ఠ పరంతప !"

అని హెచ్చరించాడు కృష్ణపరమాత్మ.

బాబూ ! నీ సందేహాలకు ఇది చాలు. అవసరం అయితే, మళ్ళీ వ్రాస్తాను.

అందరికీ శుభాశీస్సులు.

సదా మీమేలుకోరు
సీతారాం

# 11

శ్రీరస్తు : చిరంజీవి..............కి :
ప్రేమపూర్వక నారాయణ స్మరణములతో
ఆశీర్వదించి : ఉభయకుశలోపరి :

ప్రియమైన బాబూ !

నీ లేఖ అందింది నీకు చాలా సందేహాలు ఉన్నట్లూ, అవి అడిగితే వినుగుగాని, కోపంగాని వస్తుందేమో అని

సందేహిస్తున్నట్టూ వ్రాశావు. అట్టి సందేహం ఎన్నడూ పెట్టుకోకు బాబూ! నీ సందేహాలు వ్రాయి. నాకు తోచినరీతిలో సమాధానాలు వ్రాస్తాను. అప్పటికీ నీకు సందేహాలు తీరకపోతే, తీరేదాకా ప్రశ్నించు. అది దోషం కాదు సరికదా, విధికూడా.

బాబూ! ఒక్కవిషయం గుర్తుంచుకో - విసుగూ, చికాకూ, కోపం ఎక్కడ ఉన్నాయో, అక్కడ పరమార్థ జ్ఞానం శూన్యం. కోపానికీ, పరమార్థానికీ అన్యోన్యాభావం - అంటే కోపం ఉంటే పరమార్థమూ, పరమార్థం ఉంటే కోపమూ ఉండటం అసంభవం అన్నమాట. అందువల్ల, విసుగు వస్తుందేమో, కోపం వస్తుందేమో అన్న సంశయాన్ని మొదట విడిచిపెట్టు.

అయితే, అడగటంలో ఒక క్రమమూ పద్ధతీ ఉన్నాయి. ఎదుటి వ్యక్తిని పరీక్షిద్దామనో, అసూయవల్లో, దురహంకారప్రకోపంవల్లో ప్రశ్నిస్తే, ఔదాసీన్యమేతప్ప, ఎంత మొత్తుకున్నా సమాధానంరాదు. తెలుసుకుందామన్న ఆసక్తితో, ఎదుటి వ్యక్తికి తెలుసువన్న విశ్వాసంతో ఎన్ని ప్రశ్నలైనా, ఎన్నిమార్లైనా అడగవచ్చు. తప్పక సమాధానం లభిస్తుంది.

"తద్విద్ధి ప్రణిపాతేన
పరిప్రశ్నేన సేవయా"

అన్నాడు కృష్ణపరమాత్మ గీతలో.

విషయం తెలుసుకోవాలి అన్న కోరికతో మహాత్ముల సన్నిధికి వెళ్ళినప్పుడు ముందుగా చెయ్యవలసింది ప్రాణిపాతం-అంటే సాష్టాంగంగా నమస్కరించటం. అలా ఎందుకు నమస్కరించాలి, అట్టి మహాత్ములు గౌరవాన్ని ఆశిస్తారా అంటే, వారు ఆశించరు. కాని, విషయం వంట పట్టాలి అంటే అభిమానం నశించాలి. అభిమానం నశించాలి అంటే, నమస్కరించాలి. అభిమానం ఉన్నంత వరకూ, సక్రమంగా సాగిలపడలేడు ఎట్టివాడైనా. అందు చేతే, అభిమానం నశించటంకోసం ప్రణిపాతాన్ని విధించాడు పరమాత్మ. ఈ రహస్యం తెలియక, అవతలి వారు ఈ రూపంగా గౌరవాన్ని ఆశిస్తున్నారు అనుకొంటారు తెలియనివారు.

తరువాతి అంశం పరిప్రశ్న. ఒకమారూ రెండు మార్లూ అని కాదు-సందేహం తీరేవరకూ ప్రశ్నించాలి. పరిప్రశ్నవల్ల ఎదుటి వ్యక్తికి విసుగూ చికాకూ కలిగితే, ఆయనకు ఒక నమస్కారంచేసి, మరొకర్ని ఆశ్రయించవచ్చు. విషయం తెలియకపోతే, ఏం చెప్పాలో తెలియకపోతే వస్తుంది విసుగు.

ఈ విషయమే యతిగీతల్లో చెప్తున్నాను.

"తగినవారు వచ్చి తగురీతి ప్రశ్నింప
చాలలేనివాడు చాల విసుగు -
చాలగలుగువాని కేలరా విసుగొంద ?
శ్రితమనుజ శరణ్యా ! యతివరేణ్యా" అని.

కనుక, సందేహం తీరేవరకూ ప్రశ్నించి తెలుసుకోవలసిన అవసరమూ బాధ్యతా ఉన్నాయి జిజ్ఞాసువుకి.

ఇక మూడవ అంశం సేవ. గురువునకు సేవచేస్తూ పరమార్థ విషయాలు తెలుసుకోవాలి శిష్యుడు. శిష్యుని యొక్క ఆత్మయాత్ర గురువుయొక్క అధీనమూ, గురువు యొక్క శరీరయాత్ర శిష్యుని అధీనమూ. అందుచేత, గురువుయొక్క అవసరాలు గమనిస్తూ శిష్యుడు సేవ చెయ్యాలి. అయితే, నిత్యమూ గురువు సన్నిధిలో ఉండే అదృష్టానికి నోచుకోనివారి మాట ఏమిటి అంటే, గురువు చెప్పిన విషయాలను విశ్వసించి, అనుసరిస్తూ, గురువు నిర్దేశించిన అనుష్ఠానాన్ని శ్రద్ధతో అనుష్ఠిస్తే, అది గురు సేవే అవుతుంది. గురువుయొక్క అనుగ్రహం తప్పక కలుగుతుంది.

పరమాత్మ నిర్దేశించిన ఈ క్రమంలో చాలా విశిష్టత ఉంది. ముందుగా సాష్టాంగ నమస్కారం చెయ్య

టంతో శిష్యుని అభిమానం పోవటమూ, శిష్యుని అభి మానం నశించిందని గ్రహించిన గురువునకు అనుగ్రహం కలగటమూ జరుగుతుంది. తరువాత శిష్యుని ప్రశ్న పరంపర వల్ల విషయాలలో స్పష్టత ఏర్పడుతుంది. సేవద్వారా అనుభవరూపంగా నిలిచిపోతుంది. ఇక్కడ ఒకసందేహం రావచ్చు - పరిప్రశ్న, సేవ - ఈ రెంటిలో ఏది ముందు, ఏది వెనుక; సేవలేనిదే శిష్యుని ప్రశ్నలకు సరియైన సమాధానాలు లభిస్తాయా అని. కాని, శ్రద్ధగా సమాధానించే ప్రేరణ గురువునకు కలగటానికి ప్రణిపాతమూ, పరిప్రశ్నా చాలు - కాని, అది అనుభవపర్యంతం కావాలంటే - భగవదనుభవం కలగాలంటే - ఆచార్యోపాసనం - సేవ- కావాలి. అది సర్వార్థ సాధకం. కేవల సమాధానాలతో బుద్ధి - మస్తిష్కం-తృప్తిచెందవచ్చు. కాని, హృదయం స్పందించాలి అంటే అనుభవం కావాలి. అనుభవానికి మూలం ఆచార్యసేవ. ప్రణిపాతంతో కనుమరగిన అభిమానం సేవతో పూర్తిగా అంతరించిపోతుంది. అనుభవానికి ప్రధాన ప్రతిబంధకం అభిమానమే.

అభిమానం ప్రధానంగా మూడు విధాలుగా ఉంటుంది - కులాభిమానం, ధనాభిమానం, విద్యాభిమానం- అని. తాను ఉన్నతకులంలో జన్మించాను అని,

అపారంగా ధన సంపదలు కలిగి ఉన్నాననీ, తాను పండితుడననీ, తన పాండిత్యానికి తిరుగులేదనీ - మూడు విధాలుగా ఉండే శిష్యుని అభిమానాన్ని మూలముట్టుగా తెగనరికేందుకే శిష్యుని సేవను అంగీకరిస్తాడు గురువు. అభిమానం అంతరించాక, మబ్బు విడిన సూర్యునివలె జ్ఞానం ప్రకాశిస్తుంది; అనుభవంగా పరిణమిస్తుంది. ఇదీ ఈ క్రమంలోని రహస్యం. దీన్ని అర్థంచేసుకోలేక, ఇదంతా తమ గొప్పతనం కోసం చేసుకున్న ఏర్పాటు అని భావిస్తే, అంతకంటె తెలివితక్కువ ఏముంటుంది ! కనుక, ఈ విషయం జాగ్రత్తగా ఆలోచించి అర్థం చేసుకో బాబూ !

అభిమానం పూర్తిగా అంతరించిన అట్టి శిష్యునికి జ్ఞానోపదేశం చేస్తాడు జ్ఞానీ, తత్త్వదర్శీ అయిన గురువు. జ్ఞాని అంటే విషయ పరిజ్ఞానం సక్రమంగా, సమగ్రంగా కలవాడు. తత్త్వదర్శి అంటే పరమార్థతత్త్వాన్ని అనుభవ పూర్వకంగా గ్రహించినవాడు. ఈ రెండు లక్షణాలూ - సక్రమమూ సమగ్రమూ అయిన జ్ఞానమూ, అనుభవ పూర్వక పరమార్థతత్త్వ దర్శనమూ-కలవారు మాత్రమే జ్ఞానోపదేశం చెయ్యగలరు. ఇందులో ఏది కొరవడినా, వారివల్ల పూర్తి ఉపయోగం ఉండదు. అంతేకాదు -

అనుభవరూపంగా పర్యవసించని జ్ఞానం కలవాడు - తన స్థితిని అనుసరించి ఉపదేశిస్తే ఆ స్థితిని అందుకోలేని శిష్యుని పరిస్థితి విషమించటం కూడా సంభవమే. అందు వల్ల, పై రెండు లక్షణాలూ సమగ్రంగా కలిగిఉన్న వ్యక్తినే ఎన్నుకొని ఆశ్రయించాలి. ఒకవేళ రెండు లక్షణాలూ కలవారు లభ్యం కాకపోతే, అనుభవంగా పరిణమించని జ్ఞానం కలవానికంటె, అనుభవం మాత్రం ఉండి, విశేషజ్ఞానం లేనివాడు - తత్త్వదర్శి - ఎక్కువ ఉపయోగిస్తాడు. కనీసం ఇతని వల్ల హాని ఉండదు.

బాబూ! ఇది అంతా శ్రద్ధగా చదివి అర్థం చేసుకో. త్వరలోనే మళ్ళీ వ్రాస్తాను.

అందరికీ శుభాశీస్సులు.

మీ మేలుకోరు

సీతారాం

# 12

శ్రీరస్తు: చిరంజీవి.............కి:
క్షేమపూర్వక నారాయణస్మరణములతో
ఆశీర్వదించి: ఉభయకుశలోపరి:

ప్రియమైన బాబూ!

నీ లేఖద్వారా మీ క్షేమసమాచారాలు తెలిసి చాలా ఆనందించాము. నీలేఖలో నీ విషయాలన్నీ వ్రాసి, చివర వ్రాసిన సందేహం నివృత్తి కావటం కోసం ఈ లేఖ వ్రాస్తున్నాను. జాగ్రత్తగా చదువుకుని, అర్థం చేసుకుని, మననం చేసుకో. ఆచరణలోకి తెచ్చుకోవటానికి త్రికరణశుద్ధిగా ప్రయత్నించు.

మానవులలో కొంతమంది మంచివారుగానూ, మరికొంతమంది చెడ్డవారుగానూ ఉంటారు- నిజమే. అయితే, ఇక్కడ మానసిక తత్త్వాలను గురించి జాగ్రత్తగా తెలుసుకోవాలి. మీరు నన్ను గురువుగా ఎన్నుకున్నారు కనుక, అన్ని విషయాలూ మీకు చెప్పవలసిన బాధ్యత నాకు ఉంది.

ఏదైనా ఒక విషయాన్ని గురించి అన్నివైపుల నుండి - అన్ని దృక్పథాలనుండి - విచారించి తెలుసు

కుంటేగాని, ఆ విషయం తెలిసినట్టు కాదు. కాక, కొన్ని దృక్పథాలనుండి మాత్రమే ఆలోచించినవాడు, విషయం తెలియకపోగా, భ్రమ ప్రమాదాలకు లోనయే అవకాశం ఉంది.

మానవులలో - సామాన్యంగా ఎక్కువమందికి - దౌర్బల్యాలు ఎక్కువగా ఉంటాయి. ఈ దౌర్బల్యాలు శారీరకాలు కావచ్చు; ఇంద్రియకాలు కావచ్చు; మానసికాలూ, బౌద్ధికాలూ కావచ్చు.

శారీరక దౌర్బల్యాలుఅంటే, ఒకనిశరీరం పొట్టిగా ఉంటుంది- ఎత్తుగా ఉన్నవస్తువుల్ని అందుకోలేడు. ఒకని శరీరం బలహీనంగా ఉంటుంది- బరువైన పనులు చేయలేడు. ఇట్టివే ఇంకా అనేకం ఉంటాయి.

ఇంద్రియక దౌర్బల్యాలు అంటే- ఒకడు శబ్దాన్ని తేలికగా వినలేడు. వేరొకడు దూరాన ఉన్నవస్తువును చూడలేడు. ఇట్టివే ఇంకా కొన్ని ఊహించుకోవచ్చు.

ఇక, మానసికాలూ, బౌద్ధికాలూ- ఈ రెంటికీ స్థూలంగా పెద్ద భేదంలేదు- తన బాధ్యతల్ని సక్రమంగా నిర్వహించలేకపోవటం - బాధ్యతానిర్వహణానికి శరీరమూ, ఇంద్రియాలూ తగినంత శక్తిని కలిగే ఉన్నా,

మానసిక దౌర్బల్యంచేత ఆ పని చెయ్యలేకపోవటం. ఆ పనికి మనస్సు అంగీకరించదు. మనస్సు అంగీకరించనప్పుడు మనస్సుకు వ్యతిరేకంగా- శరీరంగాని, ఇంద్రియాలుగాని- పనిచెయ్యవు; చెయ్యలేవు.

దుర్బలమైన మనస్సు సంస్కారాలకు లోబడి ఉంటుంది. బుద్ధికూడా అంతే. అందుచేత, సంస్కారాలు ఎటు లాగితే అటు పోవటం తప్ప, తాను న్యాయాన్యాయ విచారణచేసి, న్యాయ్యమైనదాన్ని ఆచరించగలిగే స్థితిలో ఉండవు బుద్ధీ, మనస్సూ కూడా. ఇది ఒక విధమైన దౌర్బల్యం.

కొంతమందిలో సంస్కారాలకు లోబడటం కంటె, ఇతరులకు ఎదురుచెప్పలేని దౌర్బల్యం ఎక్కువగా ఉంటుంది. ఈ దౌర్బల్యంవల్ల, కొంతమంది, నిజంగా మంచివారు కాకపోయినా, పైకి మంచివారుగానూ, మరి కొంతమంది, నిజంగా చెడ్డవారు కాకపోయినా పైకి చెడ్డవారుగానూ కనపడతారు. ఇట్టివారు- ఎప్పుడైనా- వారి బలహీనతకు తగిన అవకాశాలు లేనప్పుడు యథార్థ స్వరూపంతో బయటపడతారు. ఒకొక్కప్పుడు వారి యథార్థ స్వరూపం బయటపడకుండానే జీవితం అంతమయ్యే సందర్భాలు కూడా ఉండవచ్చు. అందు

చేత, కొన్ని దౌర్బల్యాలవల్ల మంచివారుగా కనపడి నంత మాత్రాన మంచివారు అని కాని, చెడ్డవారుగా కనపడినంత మాత్రాన చెడ్డవారు అని కాని నిర్ణయించటం పరమార్థ ప్రపంచంలో పనికిరాదు. ఐహిక ప్రపంచంలో కూడా ఈ విషయంలో జాగ్రత్తగా ఉండాలి. లేకపోతే, ప్రమాదాలువాటిల్లే అవకాశం ఉంది.

ఒక చిన్న ఉదాహరణ :

భారతీయ సంప్రదాయాల్లో బొట్టుపెట్టుకొనటం అన్న ఆచారం ఉంది. బొట్టుపెట్టుకొనటమే మహా పుణ్యమా, పెట్టుకొనకపోవటం మహాపాపమా అన్న చర్చ ప్రస్తుతం కాదు - ఉదాహరణకు చెప్తున్నాను.

ఒకనికి బొట్టుపెట్టుకొనటం ఇష్టం. కాని, కళాశాల వాతావరణానికి లొంగిపోయే దౌర్బల్యం - తోటి విద్యార్థులు చేసే ఆక్షేపణలకు లొంగిపోయే దౌర్బల్యం - ఉంది మనస్సులో. అందువల్ల అతడు బొట్టుపెట్టుకోడు. ఇంకొకడు ఉన్నాడు - అతనికి బొట్టుపెట్టుకొనటం ఇష్టంలేదు. కాని, తలిదండ్రులకు - పెద్దలకు - ఎదురు చెప్పలేని దౌర్బల్యం ఉంది అతని మనస్సులో. అందుచేత, ప్రతి దినమూ బొట్టుపెట్టుకుంటాడు.

పై ఇద్దరిలో ఎవరు మంచివారు అని నిర్ణయిస్తాం?- బొట్టు పెట్టుకోనకపోయినా, ఇష్టంకలవాడు కనుక, మొదటి వాడు మంచివాడా, లేక ఇష్టంలేకపోయినా, బొట్టు పెట్టుకుంటున్నాడు కనుక, రెండవవాడు మంచివాడా? మొదటి వాడు - ఇష్టం ఉన్నా, బొట్టు పెట్టుకోవటంలేదు కనుక, చెడ్డవాడా, లేక రెండవవాడు - బొట్టు పెట్టుకుంటున్నా, ఇష్టం లేనివాడు కనుక, చెడ్డవాడా - ఎలా నిర్ణయించటం?

మొదటివాడు బొట్టు పెట్టుకోకపోయినా, ఇష్టం ఉన్నవాడు కనుక, వాని దౌర్బల్యానికి తగిన కారణాలు లేకపోతే - అవకాశం చిక్కితే - బొట్టు పెట్టుకొనటం అన్నది బాహాటంగానే చేస్తాడు. రెండవవాడు - బొట్టు పెట్టుకుంటున్నా, అది అతనికి ఇష్టంలేని పని కనుక, దౌర్బల్యానికి లోబడి పెట్టుకుంటున్నాడు కనుక, ఆ దౌర్బల్యం పోగానే, బొట్టు పెట్టుకొనటం మానేస్తాడు. కనుక, రెండవవానికంటె మొదటివాడే మంచివాడు అనవచ్చు.

అయితే, దీనికి ఒక అపవాదం ఉంది - మొదటి వాడు ఇష్టం ఉన్నా, దౌర్బల్యం వల్ల మానాడు కనుక, ఆ దౌర్బల్యం సాగే కాలాన్నిబట్టీ, ఇతర పరిస్థితుల్ని బట్టీ, చివరకు బొట్టు పెట్టుకొనకపోవటమే

సహజమైపోయే ప్రమాదం ఉంది. అలాగే, రెండవవాడు ఇష్టంలేకపోయినా, దౌర్బల్యానికి లోబడి బొట్టు పెట్టు కుంటున్నాడు కనుక, క్రమక్రమంగా బొట్టుపెట్టుకోనటం సహజమైపోయే అవకాశం ఉంది. ఇందులో ఈ విధమైన మేలుకి అవకాశం ఉంది. ఇదేవిధంగా, అనేక విషయాల్లో అనేక విధాలైన దౌర్బల్యాలకు లోనై ఉంటున్నాడు మానవుడు.

సాధారణంగా మానవుల్లో తమ దౌర్బల్యాలను తెలుసుకోనలేకపోవటం, ఇతరుల దౌర్బల్యాలను సులభంగా కనిపెట్టటం, తమ దౌర్బల్యాలు తెలిసినా, వాటిని దాచి, దౌర్బల్యాలను ఎరుగనివారివలె నటించటం, ఇతరుల విషయంలో దౌర్బల్యం కానిదాన్ని కూడా దౌర్బల్యంగా భావించి ప్రచారం చెయ్యటం - అనే దౌర్బల్యం ఎక్కువగా ఉంటుంది. ఇది చాలా ప్రమాదకరమైన దౌర్బల్యం.

కొంతమంది కొన్ని దౌర్బల్యాలకు లోబడి ఇతరులకు సహాయం కూడా చేస్తారు. కనుక, పైకి మంచిగా కనపడినంత మాత్రాన అందరినీ నమ్మితే, ఐహిక జీవితం లోనే ప్రమాదం. ఇక పారమార్థిక జీవితం గురించి వేరే చెప్పాలా!

కొంతమందికి, ఇతరులు తమను పొగుడుతూ, ఇచ్చకాలు చెపుతూ ఉంటే వినటం ఎంతో ఇష్టం. అలా ఇతరులచేత పొగిడించుకోవటానికి, ఇచ్చకాలు చెప్పే వారిని దగ్గర ఉంచుకోవటానికి వారు ఎంతైనా త్యాగం చేస్తారు. ఇవన్నీ ఇచ్చకాలు, అసత్యమైన పొగడ్తలు; తనను మోసగించి లాభంపొందటానికే వారు ఇలా చేస్తున్నారు-వారికి తమమీద నిజంగా ప్రేమలేదు అని తెలిసికూడా, ఆ ఇచ్చకాలనూ పొగడ్తలనూ వినటానికే ఇష్టపడతారు. ఇది ఒకవిధమైన హృదయ దౌర్బల్యం. జిహ్వాచాపల్యం కలవారు- తాము తినే పదార్థాలు అన్ని విధాలా అపకారం చేస్తాయి అని తెలిసినా వాటిని తినటం మానలేనట్టు - ఇచ్చకపు మాటలు వినటం తమకు అన్ని విధాలా నష్టం అని తెలిసినా, వినటం మానలేరు ఇట్టి వారు. ఇచ్చకపుమాటలు కానివి - అవి తమకు శ్రేయో దాయకములే అయినా - వారి చెవులకు వెగటుగా - కటిక చేదుగా - ఉంటాయి. అలా చెప్పేవారు వారికి పరమ విరోధులుగా కనపడతారు. ఇదంతా హృదయ దౌర్బల్యప్రభావం.

ఎవరి నడతకూ, చేష్టలకూ సంస్కారములే బాటలో, సంస్కారబలమే కారణమో వారందరూ దుర్బలులే.

ఎవరి నడతకూ, చేష్టలకూ ధర్మమే బాటయో, ధర్మబలమే కారణమో, వారందరూ సబలులూ, ఉత్తములూ.

ఎవరి నడతకూ, చేష్టలకూ కేవలం అప్రాకృత ప్రేమే బాటయో, ఆ ప్రేమబలమే కారణమో వారందరూ మహాత్ములు, ఉత్తమోత్తములు.

సంస్కారాలకు వశులైన వారి విషయం తీసుకుందాం- మొదటి దశలో- ప్రతిమానవుడూ సంస్కారాలకు వశుడే. అలా కాకుండా ఉండలేడు. ఇక్కడ మొదటి దశలో అంటే, సృష్టిలో మానవుడు పుట్టిన ప్రారంభ దశలో అనికాదు- మానవుని శిశుదశలో అని. ఆ దశలో మానవునికి అనేకవిధాలైన సంస్కారాలు వెనుకటి జన్మలనుండి వెంటపడి వచ్చినవి ఉంటాయి. అందువల్ల, వాని చేష్టలన్నీ ఆ సంస్కారాలకు అనుగుణంగానే ఉంటాయి. అంతకంటె అతడు ఏం చెయ్యగలడు ? అతనికి కొంత వయస్సు వచ్చే వరకూ, వాని యోగక్షేమముల బాధ్యత అతని తలిదండ్రులదే. ఎందుచేత అంటే, సంస్కారాలను ప్రస్తుత జన్మలో కూడా ఏర్పరచుకోవచ్చు. శిశుదశలో మానవుని చిత్తంమీద- అంతఃకరణంమీద- చుట్టుపట్ల ఉన్న వాతావరణానికి సంబంధించిన సంస్కా-

రాల ముద్ర బాగా పడుతుంది. ఈ విషయాన్ని గ్రహించలేక, అశ్రద్ధచేస్తున్నారు పెక్కుమంది.

మానవుడు ప్రపంచాన్ని గ్రహించగలిగిననాటి నుండీ- అంటే జ్ఞానేంద్రియాలు పనిచెయ్యటం మొదలైన నాటి నుండీ- అతని దగ్గర ఏం మాట్లాడినా, ఏ పని చేసినా, చివరకు ఏది ఆలోచించినా - వాటికి సంబంధించిన సంస్కారాలు వాని చిత్తం మీద ప్రభావం చూపిస్తాయి. ఈ విషయం గమనించి, తలిదండ్రులుగాని, ఇతరులు గాని, శిశువుల పురోభివృద్ధికరములైన సంస్కారాలే వారి చిత్తంలో పడేట్టు కృషి చెయ్యాలి. పిల్లలను పెంచటంలో కల బాధ్యతల్లో ఇది చాలా ప్రధానమైంది. ఆ వయస్సులో ఏర్పడిన సంస్కారాలే భవిష్య జ్జీవితంలో వారికి మార్గదర్శకాలు అవుతాయి. ఈ విషయంలో అశ్రద్ధవహించిన తలిదండ్రులు వారి బిడ్డల జీవితాన్ని చేజేతులా ధ్వంసంచేసిన వారే అవుతారు. విద్యార్థిదశ వచ్చిన తరువాత- తాను నేర్చుకొనే విద్యా, విద్య నేర్పబడే విధానమూ, పాఠశాల యొక్క ఏర్పాట్లూ, చుట్టుపట్ల కల వాతావరణమూ - ఇవన్నీ అతని సంస్కారాలకు కారణాలు. వాటికి తోడు ఇతర ప్రపంచం ఉండనే ఉంది. వయస్సు పెరిగేకొద్దీ, మానవునికి ఆలోచనాశక్తి కూడా పెరుగుతుంది. చుట్టు

పట్ల కల వాతావరణంవల్ల క్రొత్త సంస్కారాలు ఏర్పడటమే కాక, వయోధర్మానికి తగినట్లు ఆలోచనలు కొనసాగుతాయి. అట్టి ఆలోచనలవల్ల, అతఃపూర్వం ఏర్పడిన సంస్కారాలు చాలా బలవంతము లవుతాయి. ఇలా సంస్కారాలకు కారణమైన బాహ్య ప్రపంచమూ, ఆంతరికమైన ఆలోచనా ప్రపంచమూ - ఈ రెంటి మధ్యాపడి రూపొందుతోంది మానవుని చరిత్ర. దీన్ని గమనించి, తగినరీతిలో విద్యావిధానాన్ని రూపొందించాలి.

నిజానికి, ఈ విషయంలో సహాయం చెయ్యటానికి ప్రభుత్వం కూడా చాలా బాధ్యత వహించాలి. ప్రభుత్వాధినేతలు - తాము ఏ మతానికి సంబంధించినవారైనా, అసలు ఏ మతానికీ సంబంధించనివారైనా, ప్రభుత్వ నిర్వహణలో మాత్రం- తమ పరిపాలనలో ఏ యే మతాలవారు, ఏ యే సంప్రదాయాలవారు ఉన్నారో, వారి సిద్ధాంతాలూ, ఆచారాలూ ఇతరుల ఉనికికీ భద్రతకూ నష్టం కలిగించనంతవరకు- వారికి అనుగుణమైన విధానంలోనే సహాయపడాలి కాని, అంత కంటె ఎక్కువ జోక్యం చేసుకోరాదు.

ఇలా విద్యార్థి దశ పూర్తి అయేప్పటికి సుమారు పాతిక సంవత్సరాల వయస్సు వస్తుంది. క్రమబద్ధంగా

శిక్షణ సాగితే, అప్పటికి మానవునికి సంస్కారాల మీద అధికారం ఏర్పడుతుంది. అప్పుడు మానవుడు సంస్కారాలకు లోబడక, సంస్కారాలను ధర్మానుగుణంగా మార్చుకొని, తన బాటను వెలుగుబాటగా మలచుకుని, ఆ బాటలో శ్రేయమే గమ్యంగా పయనించగలడు; అప్పుడు ధర్మమే బాటగా నడవగలిగిన స్థితికి వస్తాడు.

కాని, ప్రస్తుతం- బాలురను సక్రమంగా పెంచటంలోనూ, విద్యార్థిదశను సక్రమంగా మలచటంలోనూ ఎవరూ శ్రద్ధవహించటం లేదు. విద్య అంటే కేవలం వ్రాయగలగటం, చదవగలగటం మాత్రమే కాదు- అదే అయితే, విద్య, ప్రవర్తన- ఈ రెంటిలో ప్రవర్తనే ప్రధానం. ప్రవర్తన లేని విద్య ఎందుకూ కొరగాదు. ప్రవర్తన బాగుంటే, విద్య లేకపోయినా, వాడు తనకూ, సంఘానికీ కూడా ఉపయోగిస్తాడు. కాని, సక్రమంగా ఆలోచిస్తే, మంచి ప్రవర్తనతో కూడిన విద్యయే విద్య. ఈ రెంటిలో ప్రవర్తన ప్రాణం. ప్రవర్తనకు సంస్కారాలు మూలాధారం. సంస్కారాలకు చుట్టుపట్ల కల వాతావరణం ప్రధాన కారణం. కనుక మానవుని భవిష్యజ్జీవితానికి పునాదిరాళ్ళైన శిశుదశ, విద్యార్థిదశ- ఈ రెంటినీ పెద్దలు ఏ మాత్రం అశ్రద్ధచేసినా, మానవుడు అనేక దౌర్బల్యాలకు ఆటపట్టు అవుతాడు. అట్టివాతే

అధిక సంఖ్యాకులు అయి నప్పుడు, దేశం ఎలాఉంటుందో, ఏ కొంచెం విజ్ఞానం ఉన్నవారికైనా తెలుస్తుంది. విజ్ఞానులం అనుకున్నవారే సంస్కారాలకు లోబడి పోతూంటే ఇక ఇతరుల విషయం ఏం చెప్పాలి!

"సదృశం చేష్టతే స్వస్యాః
ప్రకృతేః జ్ఞానవా నపి
ప్రకృతిం యాంతి భూతాని
నిగ్రహం కిం కరిష్యతి ?" అనీ,
"యతతో హ్యాపి కౌంతేయ !
పురుషస్య విపశ్చితః
ఇంద్రియాణి ప్రమాథీని
హరంతి ప్రసభం మనః" అనీ

గీతలో చెప్పబడింది ఇందుకే.

మానవుడు ఎప్పుడైతే సంస్కారాలకు లోనయాడో అప్పుడు ఇక మంచి, చెడ్డ అనే ఆలోచనకు ప్రాధాన్యం ఉండదు. ఒకవేళ బుద్ధి అలా ఆలోచించినా, సంస్కారాలకు లోబడిన మనస్సు బుద్ధిని ధిక్కరించి, తన ఇష్టాను సారం ఇంద్రియాలను ఆజ్ఞాపిస్తుంది.

అందుచేత, సామాన్యంగా మానవుడు ఎప్పుడైనా మంచిచేసినా, తన సంస్కారాలకు లోబడి చెయ్యటమే

కాని, సక్రమమైన విచారణ చేసి కాదు; అలాగే చెడు చేసేవాడు కూడా. సంస్కారాలకు లోబడటం అనేది ఇద్దరికీ సమానధర్మమే. అయితే, సంస్కారాలకు లోబడినవాడు కూడా, తదనుగుణమైన పని చెయ్యకుండా ఒకొక్కప్పుడు ఉండవచ్చు. దానికి కారణం - వానికి సంస్కారబలంకంటె, ఆ పని చెయ్యటంచేత కలిగే ప్రమాదాన్ని గూర్చిన భయం బలమైంది కావటమే కాని, వేరు కాదు. సంస్కారాలకు లోబడి చేసిన మంచి పనుల వల్ల, లోకంలో ఒడుదుడుకులూ, సంఘర్షణలూ రాకపోవచ్చుగాని, కలగవలసినంత ఫలితం మాత్రం కలగదు.

మానసిక దౌర్బల్యం అంటే సంస్కారాలకు లోబడి ఉండటమే. ఈ స్థితి పశుపక్ష్యాదులకు సహజం. అందువల్ల, ఈ స్థితిలో ఉన్న మానవుడు పశుతుల్యుడే. పశువులకంటె జ్ఞానం కలవాడుగా కనపడినా, ఆ జ్ఞానం, తన పశుత్వాన్ని - సంస్కారాలకు లోబడి ప్రవర్తించటాన్ని - క్రియారూపంలోకి తెచ్చుకోవటానికి ఉపాయాలు వెతకటంలోనూ, అపాయాలను తప్పించుకొనటంలోనూ ఉపయోగిస్తుందేగాని, సంస్కారాలకు లోబడి ప్రవర్తించటం అనేది ఉభయత్రా సమానమే.

సంస్కారాల తత్త్వాన్ని - మానసిక తత్త్వాన్ని - బాగా ఎరిగిన మహర్షులు చక్కని వెలుగుబాట వేసి

వెళ్ళారు. ప్రస్తుత విద్యావిధానం ఆధునిక నాగరకత పేరుతో మన మహర్షులయందు ఏవగింపు కలగటానికి దోహదం చేస్తుంది. ఇది నిజంగా మనదేశం యొక్క దౌర్భాగ్యమే. విద్యవల్ల ధన సంపాదన ఒక్కటే ప్రయోజనం కాదు. కేవలం ధనసంపాదన కొరకే చదువు కొనటం మనదేశస్వరూపం ప్రకారం నీచాతినీచం.

మంచి సంస్కారాలను సంపాదించుకొనటం; సంస్కారాలను వశంలో ఉంచుకొనటం; తనకూ, సంఘానికీ సేవచేసుకొనటం; పరమార్థం సంపాదించుకొనటం - ఇవే విద్యయొక్క నిజమైన ప్రయోజనం. కనుక, మీరందరూ విద్యావంతులు కండి !

ఏదో వ్రాశాను - జాగ్రత్తగా చదువుకుని, సందేహాలుంటే మళ్ళీ వ్రాయి బాబూ! ఈ విషయాన్ని గురించి మీ మిత్రులతో కూడా చర్చించు.

అందరికీ శుభాశీస్సులు.

సదా మీ మేలుకోరు

సీతారాం

## 13

హైదరాబాద

శ్రీరస్తు: చిరంజీవి..........కి:
క్షేమపూర్వక నారాయణస్మరణములతో
ఆశీర్వదించి: ఉభయకుశలోపరి:

ప్రియమైన తల్లీ!

మీరందరూ ఎంతో జాగ్రత్తతో మెలగాలి ప్రపంచంలో అందరూ సుఖాలే పొందాలనీ, ధనవంతులే కావాలనీ, విద్యావంతులే కావాలనీ, అధికార హోదాల్లో ఉండాలనీ, అందరిచేతా గౌరవింపబడాలనీ, ఆయురారోగ్యాలు సంపూర్ణంగా కలిగిఉండాలనీ- ఇలా అంతా మంచినే కోరుకుంటాము. కాని, అన్నీ అందరికీ లభిస్తున్నాయా? లేదు- ఎందుచేత?

ప్రతి జీవికీ అనుభవం అంతా ప్రారబ్ధాన్ని బట్టి నిర్ణయింపబడి ఉంటుంది. దాన్ని మార్చుకొనటానికి ఎవరికీ శక్తిలేదు- బ్రహ్మాదిదేవతలు కూడా మార్చలేరు; పరమాత్మ మార్చడు. ఈ తత్త్వం తెలుసుకుని, దాన్ని నమ్మిఉంటే, ఎవరైనా సుఖపడగలరు. అలాకాక, ఏవేవో అపేక్షలు పెట్టుకుని, వాటికోసం క్రిందా మీదా పడుతూ

ప్రయత్నాలు చేస్తూ, అవి ప్రారబ్ధంలో లేకపోవటంచేత లభించకపోతే క్రుంగిపోతూ జీవితాన్ని దుఃఖమయం చేసుకుంటారు పామరులు. కొన్ని సందర్భాల్లో, ప్రయత్నిస్తే ఫలించేట్టు కనపడుతుంది- కాని, ఆ ప్రయత్నానికే అవకాశం దొరకదు. ఆ అవకాశం కోసం దైన్యంతో ఎదురు చూస్తూ, ఇతరులకు సోమరులవలె కనపడుతూ జీవితాలను పాడుచేసుకుంటారు కొంతమంది. ఇదంతా న్యాయ్యములైన కోరికల విషయంలో. ఇక కోరికలే అన్యాయ్యములైనప్పుడు వేరే ఏం చెప్పాలి! జీవితం అంతా దుఃఖమే దుఃఖం.

కొంతమంది ఎంతో సుఖపడుతున్నట్టూ, భోగభాగ్యాలతో తులతూగుతున్నట్టూ బయటకు కనపడతారు. కాని, వారు మానసికంగా చాలా నికృష్టస్థితిలో ఉంటారు - ఇటువంటిది ఈ ప్రపంచం.

ప్రారబ్ధకర్మరీత్యా లభించిన దానితో తృప్తిపడి, మంచిగా కాలం గడుపుకుంటే, మానవుడు తన అసలు చోటు-సుఖం అనుభవిస్తాడు. ఇక్కడ నిజానికి సుఖం ఎవరికీ లేదు. ఈ స్థితిలోనే మానవుడు పరమాత్మను మరిచిపోతున్నాడు; మరువనివాడుకూడా భగవంతునికంటె, ఈ లోకాన్నే ఎక్కువగా ప్రేమిస్తున్నాడు. ఇక,

మానవునికి అనుకున్నవన్నీ సాగితే, అన్నీ సుఖాలే లభిస్తే, ఎలా ఉంటుందో చెప్పాలా !

మానవజన్మ లభించింది ఇక్కడ సుఖాలు అనుభవించటానికి కాదు; మోక్షాన్ని పొందటానికి, అందుచేతే, ఇక్కడ ఏమీ స్వాతంత్ర్యం లేకుండా చేశాడు పరమాత్మ. మానవుడు ప్రయత్నించినా, ప్రయత్నించక పోయినా - కోరినా, కోరకపోయినా - కష్టాలుగాని, సుఖాలుగాని, ప్రారబ్ధ కర్మరీత్యా వస్తూనే ఉంటాయి. అయితే, మానవుడు కష్టాలను ఇష్టపడడు; సుఖాలనే కోరుకుంటాడు. అందుచేత, కష్టాలువస్తే భరించలేడు. అయితే, సుఖాలు వస్తే మాత్రం - తాను కోరినా, కోరక పోయినా - సంతోషపడతాడు. కష్టాలు వచ్చినప్పుడు మాత్రం బాధపడతాడు. కాని, కష్టాలు వచ్చి తీరతాయి. వాటిని భరించే సామర్థ్యం మనస్సుకి లేకపోతే బాధతప్పదు. అందుచేత మానవుడు ప్రారంభంలో కష్టాలకే ఎదురుచూడాలి. కష్టాలు అకస్మాత్తుగా వచ్చినప్పటికంటె, మనం సిద్ధంగా ఉన్నప్పుడు వస్తే, తట్టుకోవటం తేలిక. అలా సిద్ధంగా ఉండక కంగారుపడితే, ఆ వచ్చిన కష్టాలు ప్రారబ్ధకర్మవల్ల వచ్చినవి అని తెలియక, ఇతరులు ఎవరో కారకులని

భ్రమించి, వారిని దూషిస్తే, దానివల్ల కలిగే దుష్ఫలం మరుసటి జన్మకుకూడా సిద్ధమౌతుంది. అప్పుడు, ఆ వచ్చే జన్మకూడా దుఃఖప్రదమే అవుతుంది. మీరు ఇది బాగా తెలుసుకుని, హృదయపూర్వకంగా మననం చేసుకుని మోక్షాన్ని పొందటానికి - భగవంతుని పొందటానికి - లభించిన ఈ జన్మను సార్థకం చేసుకోండి.

సౌకర్యాలన్నీ లభిస్తేనే సాధన చేసుకుందాం అనుకుంటే, మీరు పరమార్థం సంపాదించుకోలేరు. సౌకర్యాలన్నీ లభించాలి అంటే, ధనం కావాలి. దానికోరకు ఎవరిని అడుగుతాం? ఎవరి దగ్గరకు వెళ్ళి తుచ్ఛంగా చేయజాద్దాం? ఈ హైన్యం మన ఆశ్రమానికి ఎన్నడూ పట్టకుండుగాక! అవసరమైతే కూలి చేసుకుని బ్రతకటం మంచిది. కాని, యాచన మాత్రం పనికిరాదు. అయితే, రామకైంకర్య భిక్ష యాచనకాదు. కాని, శారీరకంగా ఇప్పుడు భిక్ష చెయ్యగల స్థితిలో నేనులేను.

నా శిష్యులు అనుకునేవాళ్ళలో చాలమంది ఆర్థికంగానూ, పారమార్థికంగానూ కూడా నన్ను బాధపెడుతున్నారు. పారమార్థికంగా బాధపెట్టకుండా ఉంటే, ఆర్థికమైన బాధను నేను లెక్కచెయ్యను. మన సమాజంలోని కొంతమంది అంతఃకరణ శుద్ధిలేక, నన్ను మరీ బాధ

పెడుతున్నారు. ఎన్ని చెప్పినా, నా బాగోగులకు మీరు ఏమాత్రం ప్రాధాన్యం ఇవ్వటంలేదు. ఒకరి నొకరు మాటలు అనుకోవటం, తగాదాలు పడటం జరుగుతూనే ఉంది. అందుకనే, మీరు వ్రాసిన లేఖలకు నేను సమాధానం ఇవ్వటంలేదు తల్లీ !

పైకి మంచిగా కనపడటానికే ప్రాధాన్యం ఇస్తున్నారు కాని, నా ఆరోగ్యవిషయమైకాని, పరమార్థ ప్రచార విషయమైకాని మీకు ప్రాధాన్యంలేదు సరికదా, మీ పరమార్థ విషయమైకూడా మీకు ప్రాధాన్యంలేదు. కోపతాపాలు వచ్చినప్పుడు అన్నీ సర్వనాశనం చేసుకుంటున్నారు. అటువంటి మీరు నామీద భక్తి ఉన్నట్టు ఎన్ని కబుర్లు చెప్పినా, అది నిజం అని నేను ఎలా అనుకుంటాను ? కోపం వస్తే, ఎవరినైనా, ఎంతమాట అనటానికైనా సిద్ధపడే వాతావరణం నాకు పరమ శత్రువు. ఆ వాతావరణంలో ఉంటే, బలమైన శత్రువర్గంలో ఉన్నట్టే ఉంటుంది నాకు. 'ఎవరికి పుట్టిన బిడ్డగా వెక్కి-వెక్కి ఏడ్చె?' అన్నట్టు నా బాధ ఎవరికి కావాలి ? మీకు పరమార్థంమీద అంత శ్రద్ధాసక్తులు లేనప్పుడు, మీ విషయంలో బాధ్యత వహించవలసిన అవసరం నాకేమి ఉంది ? దేహసంబంధమా ? దేహసంబంధంవల్లే

అయితే, నా పరమార్థం నట్టేట కలిసినట్టే. శిష్యసంబంధం చేతా అంటే, శిష్యులైతే చెప్పినమాట వింటారు. అది లేనేలేదు.

నా శిష్యులుగా ఉంటున్నవారు అందరూ ఈ విషయం బాగా ఆలోచించుకుని, జాగ్రత్తతో - శ్రద్ధతో వ్యవహరించాలి. నియమాలు పాలించాలి. పరస్పరం గౌరవాదరాలతో ఉండాలి. మీలో మీరు కొట్లాడుకుంటే అది నన్ను అవమానించినట్టే. మీలో మీరు ఎవరిని ఏమి అన్నా, అది నన్ను అన్నట్టే. మీలో మీరు ఎవరిని అనుమానించినా- సందేహించినా- అది నన్ను అనుమానించినట్టే. లోకంలో అందరినీ ఆదరించండి, విశ్వసించండి, ప్రేమించండి అంటూంటే, ఒక గురువు శిష్యులు మీలో మీకు అయినా పరస్పరం విశ్వాసం, ప్రేమాదరాలూ లేకపోతే, మీరు చేసే సాధన అంతా వ్యర్థం. మీలో మీరు ప్రేమాదరాలతో, పరస్పర విశ్వాసంతో ఉంటూ ఈ ప్రేమాదరాలూ, విశ్వాసమూ సర్వ ప్రపంచం విషయంలోనూ విస్తరించే యత్నమే నిజమైన సాధన. ఇది లేనినాడు తక్కినది అంతా బూటకమే.

అందరికీ నా ఈ సందేశాన్ని, హెచ్చరికను అందించండి. మీరు అంతా ఇలా పాటించిననాడు, తక్కిన మీ

లోపాలు అన్నీ అవే సరిదిద్దబడతాయి. బాగా ఆలో చించుకుని మననం చేసుకోండి. తల్లీ ! మీకు లభించిన ఈ అవకాశాన్ని నిరుపయోగం చేసుకోకండి.

అందరికీ శుభాశీస్సులు.

మీ పిచ్చికుమారుడు
**సీతారాం**

# 14

శ్రీరస్తు: చిరంజీవి............కి :
ప్రేమపూర్వక నారాయణ స్మరణములతో
ఆశీర్వదించి : ఉభయకుశలోపరి :

ప్రియమైన బాబూ !

నీ లేఖ చేరింది. నీ జిజ్ఞాసకు ఎంతో ఆనందం అయింది. "గృహస్థులు కూడా బ్రహ్మచర్యం అవలంబించటం అవసరం అంటూ కొందరు పెద్దలు చెప్పటం విన్నాను - అది సాధ్యమా ? ధర్మమా ?" అని ప్రశ్నించావు.

సరియైన అవగాహన కలిగి, సక్రమంగా నిర్వహింపబడే గృహస్థ ధర్మానికీ, బ్రహ్మచర్యానికీ వైరుధ్యం లేదు. అవివాహితులకూ, వివాహితులకూ కూడా

బ్రహ్మచర్యం విధింపబడే ఉన్నది. అవివాహితులకు విధింపబడిన బ్రహ్మచర్యంలో స్త్రీ పురుష సంగమం పూర్తిగా నిషిద్ధం; వివాహితులకు విధింపబడిన బ్రహ్మచర్యంలో క్రమబద్ధం. భగవన్నివేదితమైన ప్రసాదం, ఒక పరిమితికి లోబడి స్వీకరించటం ఏకాదశి ఉపవాసానికి బాధాకరం కానట్టే, సత్సంతానాభిలాషతో, దేశకాల నియమాన్ని అతిక్రమించకుండా నిర్వహించే దాంపత్య ధర్మం బ్రహ్మచర్యానికి బాధాకరంకాదు.

గృహస్థులుగా ఉండి నిర్వహించే బ్రహ్మచర్యం రెండు విధాలుగా చెప్పుకోవచ్చు - ఒకటి - సత్సంతానం కొరకే దాంపత్యం కనుక, ఇరువురు బిడ్డలు కలిగిన అనంతరం దంపతులు పరస్పరం సంప్రదించుకొని, ఉభయుల అంగీకారంపైనా అవలంబించే బ్రహ్మచర్యం. రెండులో స్త్రీ పురుష సంగమం నిషిద్ధమే. ఇది దృఢ చిత్తంతో ఉభయులూ అంగీకరించి, చేసుకోవలసిన నియమం. అది ఎంతవరకు నిలుస్తుందో తరువాత తేలే విషయమే అయినా, తనకు వైరాగ్యం కలిగింది అన్న భావంతో బుడబుడా తాను నిర్ణయం చేసుకుంటే, తన పైనే ఆధారపడి ఉన్న, ఆధారపడి ఉండవలసిన రెండవ వారి గతి ఏంకావాలి? తనది యథార్థమైన వైరాగ్యమే

అయితే, కేవలం రెండవవారికొరకే తాను దాంపత్యం నిర్వహించినంత మాత్రంచేత వైరాగ్యానికి ముప్పురాదు- రారాదు. అలా వచ్చే స్థితి ఉన్నంతవరకు అది యథార్థమైన వైరాగ్యం కానేకాదు. కనుక, గృహస్థు తన స్థితిని మాత్రమే దృష్టిలో ఉంచుకొని, ఏకపక్ష నిర్ణయం తీసుకొనటం ధర్మవిరుద్ధం అనే చెప్పాలి. ఉభయుల సంప్రదింపుపై, ఏకీభావంతో నిర్ణయం తీసుకొని దీక్ష అవలంబించవచ్చు - ప్రస్తుతం వనాలకు పోయే వీలులేకున్నా, అట్టివారిని వానప్రస్థులు అనవచ్చు. ఒకరికొకరు తోడుగా ఉంటూ, సహకరించుకుంటూ, ఆధ్యాత్మిక సాధన చేసుకుంటూ ఉంటారు. ఇది ఒక విధమైన బ్రహ్మచర్యం గృహస్థులలో.

రెండవది - దాంపత్య ధర్మ నిర్వహణలోనే బ్రహ్మచర్యం పాటించటం. క్రమబద్ధంగా, దేశకాల నియమాలను అనుసరిస్తూ, సత్సంతానం కొరకుగా దాంపత్యధర్మం నిర్వహిస్తూ, ఇతర సమయాల్లో నిగ్రహం కలిగి ఉండటం కూడా బ్రహ్మచర్యమే. నిజానికి ప్రతి గృహస్థూ ఇది పాటించితీరాలి. ఇది పాటించనినాడు ఏకనిష్ఠ వ్యభిచారమే అవుతుంది కాని, అది దాంపత్య ధర్మం అనిపించుకోదు.

ఋతుకాలం దాంపత్య ధర్మానికి తగిన సమయం. ఋతుకాలం అంటే రజోదర్శనం అయిననాటినుండి పదహారు దినాలు అని నిర్ణయం. ఆ పదహారు దినాలలో మొదటి నాలుగూ నిషిద్ధ దినాలు- పూర్ణిమ, అమావాస్య, ఏకాదశి మొదలైన పర్వదినాలూ, అవతార పురుషుల యొక్కా, మహాత్ముల యొక్కా జయంత్యుత్సవాలూ, పితృశ్రాద్ధదినాలూ, శ్రాద్ధంలో తాను భోక్తగా నిమంత్రింపబడిన దినాలూ, నిషిద్ధాలు. ఈ క్రమాన్ని పాటించిననాడు ఆ గృహస్థు బ్రహ్మచారి అనే చెప్పాలి. ఋతుకాలంలోనూ, పైన పేర్కొన్న నిషద్ధదినాలు పోగా మిగిలినదినాల్లో నెలకు ఒక్కమారూ కలియటం ఉత్తమం. నిషిద్ధములుకాని అన్నిదినాలూ ఉపయోగించుకొనటం మధ్యమం. అంతకంటె అతిక్రమిస్తే మాత్రం అది అక్రమమే అవుతుంది.

మరొక రహస్యం- గర్భధారణానికి తగిన వికాసం స్త్రీకి ఋతుకాలంలో మాత్రమే ఉంటుంది. తక్కిన కాలాల్లో అవకాశం ఉండదు. అట్టి స్థితిలో వీర్యం వ్యర్థం చెయ్యటం భ్రూణహత్యతో సమానం అని శాస్త్రాలు చెపుతున్నాయి. కనుక, గృహస్థులు ఈ నియమాలు పాటించటం అవసరం.

అయితే, ఈ కాలంలో ఇదంతా ఎవరికి కావాలి ? పరమార్థానికి ప్రాముఖ్యం ఇచ్చేవారు అయినా ఈ క్రమం పాటిస్తే ఉత్తమఫలాన్ని పొందగలుగుతారు.

బాబూ! నువ్వు ఎంతో ఆసక్తితో అడిగావు కనుక, ఇంత వ్రాశాను. ఈ కాలంలో ఇది అరణ్యరోదనమే- ఆసక్తికల మీవంటి ఒకరిద్దరు పాటించినా- కనీసం ఆలోచించినా- నేను ధన్యుణ్ణే.

అందరికీ శుభాశీస్సులు-

మీ మేలుకోరు

**సీతారాం**

# 15

శ్రీరస్తు : చిరంజీవి.............కి:
ప్రేమపూర్వక నారాయణ స్మరణములతో
ఆశీర్వదించి : ఉభయకుశలోపరి :

ప్రియమైన బాబూ !

నీ లేఖ అందింది.

"ఆర్తితో భగవంతుణ్ణి పిలిస్తే క్షణమైనా ఆగకనీ, వెనువెంటనే అనుగ్రహిస్తాడనీ, సాక్షాత్కరిస్తాడనీ చెప్తారు కదా, భగవన్నామ సంకీర్తన చేసేప్పుడూ, భగవ

త్కథాగానం జరిగేప్పుడూ, లీలాగోష్ఠిలో ఉన్నప్పుడూ కొందరు నిర్విరామంగా కన్నీరు కారుస్తూ ఉంటారు; వెక్కి వెక్కి ఏడుస్తూ ఉంటారు; ఆపదలో ఆర్తితో రోదిస్తూ ప్రార్థిస్తారు - మరి భక్తుల కన్నీటిబొట్టు కూడా చూడలేని దయార్ద్ర హృదయుడైన పరమాత్మ వీరింత విలపిస్తున్నా వినుపించుకోడేం ? వెంటనేవచ్చి రక్షించడేం ?" ఇది నీ ప్రశ్న. దీనికి సమాధానం కొంత విస్తరించి ఉండక తప్పదు - ఓపికగా చదువు బాబూ ! అప్పటికి సంశయం తీరకపోయినా, క్రొత్త సంసయాలు రేకెత్తినా వ్రాయి. యథాశక్తిగా సమాధానం చెప్పటానికి ప్రయత్నిస్తాను. నీ లేఖలో "ఈ ప్రశ్న వేసినందుకు కోపగించవద్దు" అని వ్రాశావు. ఇంతకాలంగా నన్ను ఎరిగిన నువ్వు నన్ను అర్థంచేసుకున్నది ఇదేనా ? కోపం ఎన్నడూ కాదు బాబూ నాకు !

ఇక అసలు విషయానికి వస్తాను—

సాధారణంగా మానవుని అంతఃకరణంలో అనేకమైన ప్రాపంచిక వాంఛలు ఉంటాయి - అవిఉన్నట్టు తనకు తెలుస్తూ ఉండవచ్చు; తెలియకాపోవచ్చు. ఆ కోరికలు నెరవేరితే సంతోషమూ, నెరవేరకపోతే దుఃఖమూ పొందటం సామాన్య మానవుల లక్షణం. క్రమశిక్షణతో సాధన చేసేవారిలో ఈ లక్షణం క్రమంగా తగ్గుతూ

ఉంటుంది. కొంతమంది క్రమశిక్షణ కలిగిఉండరు; త్రికరణ శుద్ధిగా పరమాత్మను శరణాగతి చేసినవారా కాదు; అయితే, అంతఃకరణలో సహజంగా ఉన్న ఆస్తికవాసనల ప్రేరణచేత, భగవత్కథలు చదవటం, ఆయన లీలలు స్మరించటం, సంకీర్తన, ప్రార్థన చెయ్యటం జరుగుతుంది. ఇవన్నీ చేస్తున్నా, మానవులలోని ఈ సామాన్యలక్షణం మాత్రం వృద్ధిపొందుతూ వెంటపడుతూనే ఉంటుంది. అయితే, క్రమశిక్షణతో సాధనచేసినట్లయితే, కాంక్షలు క్రమంగా బలహీనములై, నశిస్తాయి. అలా అయితే మంచిదే. కాని, కాంక్షలు నెరవేరక, నెరవేరతాయి అనే ధైర్యంకూడా లేని స్థితిలో మానవుడు భగవంతుణ్ణి ప్రార్థిస్తూకూడా దుఃఖిస్తూనే ఉంటాడు. ప్రార్థన నిజంగానే చేస్తున్నా దుఃఖం మాత్రం భగవంతుని ప్రార్థిస్తూ తన కష్టాలు చెప్పుకునేప్పుడు, ఆ కష్టాలు గుర్తురావటం వల్ల కలిగిన దుఃఖం - ఇది ఒకరకం. ఇందులో ప్రార్థన ఆస్తిక వాతావరణ బలంవల్ల పైపైన జరిగిందే అవటం వల్ల, దీనికి అంత ప్రాధాన్యంలేదు.

ఇక రెండవరకపు దుఃఖం - కాంక్షలు నెరవేరక పోవటంవల్లా, కష్టాలు భరించలేకపోవటంవల్లా కలుగుతుంది. అయితే, భగవంతుని ప్రార్థించేప్పుడు, ఆయన

తప్ప ఎవరూ తమ కష్టాలు తీర్చలేరనీ, ఆయన దయా స్వరూపుడు కనుక, విశ్వాసంతో ప్రార్థిస్తే తమ కష్టాలు తీర్చే పరమాప్తుడనీ, శ్రద్ధా విశ్వాసమూ కలిగి ప్రార్థిస్తారు కొంతమంది. అప్పుడు వారికి కూడా పరమ దుఃఖం కలుగుతుంది. ఈ దుఃఖం, కష్టాలు అనుభవించేప్పుడు మాత్రమే కలిగేదికాక, ఎప్పుడూ వదలకుండా ఉంటే, అది - తండ్రినుండి తప్పిపోయి, ఎంతో భయంతో బాధపడుతూ, అకస్మాత్తుగా తండ్రి కనపడినప్పుడు అమాయకంగా వెక్కి-వెక్కి ఏడ్చే చంటిబిడ్డ దుఃఖం వంటిది.

వీరి దుఃఖంలో భగవంతుడు తనవాడనీ, సర్వ సమర్థుడనీ, సర్వజ్ఞుడనీ, దయానిధి అనీ, తమ మొరలు విని తప్పక రక్షిస్తాడనీ మహా విశ్వాసం పూర్తిగా ఇమిడి ఉంటుంది. కనుక, భగవంతుడు వీరి మొర ఆలించి రక్షించి తీరతాడు. కాని, వీరుకూడా కామ్య భక్తులే.

కేవలం నిష్కామ భక్తులతో - ప్రేమాత్మికా భక్తులతో - సరితూచినప్పుడు ఈ భక్తులు తక్కువ శ్రేణికి చెందినవారేకాని, ఇతర ప్రపంచదృష్టితో చూస్తే, వీరు చాలా గొప్పవారు. వీరి ప్రార్థనలో విశ్వాసం ఎంత మేరకు కొరత ఉంటే, రక్షణ అంతమేరకు ఆలస్యం

అవుతుంది కాని, రక్షణ మాత్రం లభించితీరుతుంది. కాని, విశ్వాసం పరిపూర్ణం అయితే గాని, రక్షణ లభించదు. అందువల్ల రక్షణ ఆలస్యం అయినకొద్దీ వీరి విశ్వాసంలోని కొరత పూర్తి అవుతుంది. అంతేకాని, కొంతమంది అనుకున్నట్లు, రక్షణ ఆలస్యం అయినకొద్దీ అసలు విశ్వాసమే నశించటం జరగదు.

అసలు విశ్వాసం లేక, విశ్వాసం అనే వేషం ధరించి, మోసగించే నకిలీ విశ్వాసం ఉంటుంది కొంత మందికి. అట్టివారు తమస్థితిని గురించి ఇతరులు కాక, తామే మోసపోయి, తమది అసలు విశ్వాసమే అను కొంటారు. వారు భగవంతుని ప్రార్థించినా, ఆ ప్రార్థనకు ఆధారం నకిలీ విశ్వాసమే కనుక, వారి ప్రార్థనను భగవంతుడు ఆలకించడు. అందువల్ల రక్షణ ఆలస్యం అవటం కాదు, అసలు రానేరాదు. రక్షణ ఏమాత్రం ఆలస్యం అయినా, వారి విశ్వాసం పూర్తిగా కూలి పోతుంది; కాని, నిజమైన విశ్వాసం అయితే, రక్షణ ఆలస్యం అయినకొద్దీ, పెరగటమేకాని, తరగటం ఉండదు. అట్టివారి విశ్వాసం పరిపూర్ణం అవటానికి భగవంతుడు తెరచాటునే ఉండి రక్షణ ఆలస్యం చేస్తాడు. అప్పుడు విశ్వాసంలో ఉన్న కొరతా, కల్తీ పోతాయి. వెంటనే రక్షణ లభిస్తుంది.

కర్తీ విశ్వాసం వేరు; నకిలీ విశ్వాసం వేరు. నకిలీ విశ్వాసం అంటే, అది అసలు విశ్వాసం కానేకాదు, విశ్వాసం వలె పైకి కనపడుతుంది. కర్తీ విశ్వాసం అంటే, విశ్వాసం ఉంటుంది కాని, దానిలో కొరతా, కర్తీ ఉంటాయి. అట్టివారికి రక్షణ ఎంత ఆలస్యం అయినా, విశ్వాసం పోదు. విశ్వాసం మరీ తక్కువగా ఉండి, కర్తీ ఎక్కువగా ఉన్నప్పుడు, రక్షణ వెంటనే లభించకపోతే విశ్వాసం దెబ్బతిన్నట్టు ఉంటుంది. తాత్కాలికంగా తగ్గినట్టు ఉంటుంది కాని, పోదు; మళ్ళీ అవకాశం చిక్కినప్పుడు తల ఎత్తి, అంతకంటె బలంగా వృద్ధిచెందటం ప్రారంభిస్తుంది. ఇదే విశ్వాసం యొక్క లక్షణం. నకిలీ విశ్వాసం నకిలీ బంగారం వంటిది. అగ్నిలో పడవేయగానే మాడిపోతుంది. విశ్వాసాన్ని గురించి వివరించటం అవసరం అని ఇదంతా వ్రాశాను - మళ్ళీ విషయానికి వస్తాను-

ఇక మూడవరకపు దుఃఖం - ప్రాపంచికములైన కాంక్షలు లేకపోయినా, తెలిసో తెలియకో ఏమేమి పాపాలు చేశామో, ఆ పాపాలకు యముడు ఏ దండన విధిస్తాడో అన్న భయంతో భగవంతుని ప్రార్థిస్తారు కొంతమంది. అప్పుడు కూడా సాధకులకు దుఃఖం కలుగు

తుంది. ఈ దుఃఖం కూడా కష్టాలూ దుఃఖాలూ భరించ లేక కలిగిన దుఃఖమే అయినా, రెండవరకపు దుఃఖం కంటె శ్రేష్ఠమైంది. ఈ దుఃఖంలో కేవలం మోక్షం కావాలి అనే ఆశయం ఒక్కటేకాక, కష్టాలూ దుఃఖాలూ లేని మానవజన్మ వస్తే వద్దనరు - ఆ వీలు లేకపోతే మోక్షం కావాలి వారికి. వారి అభిప్రాయంలో కష్టాలూ, దుఃఖాలూ అంటే - దారిద్ర్యం, వ్యాధి, శత్రుపీడ, అకాల మృత్యువు, గయ్యాళి భార్య మొదలైనవి. ఇవి ఏమాత్రం లేకుండా, అపరిమితమైన ధన సంపద, సర్వకాలాలలో సర్వవిధాలా అమితమైన సౌఖ్యాన్ని కలిగించే పెద్ద భవనం, తాము ఏమీ శ్రమపడ నక్కర లేకుండా చేతినిండా సేవకులు, ఆరోగ్యవంతురాలూ, పతివ్రతా అయిన భార్య, ఎంతతిన్నా ఇట్టే హరించుకు పోగల జఠరాగ్ని, తమమాటకు తిరుగులేక చెలామణీ అయే పలుకుబడి, అధికారం, పూర్ణాయుర్దాయం - ఇవి సుఖాలు. ఇవి ఉంటే వారికి మోక్షం అక్కరలేదు; ఇవి లభించే అవకాశం లేకపోతే, మోక్షం కావాలి.

నాలుగవరకపు దుఃఖం - ప్రాపంచిక సుఖాలే కాదు, బ్రహ్మలోక పర్యంతములైన ఊర్ధ్వలోకపు సుఖాలు కూడా నిజానికి సుఖాలు కావు- దుఃఖాలు అనీ,

వాటిని సుఖాలు అనుకోవటం అజ్ఞానం అనీ, కనుక, ఈ ప్రకృతిబంధనం నుండి బయటపడాలి అనీ కోరుకుంటారు కొంతమంది సాధకులు. ఇది స్వశక్తిపై ఆధారపడి సాధించటం ఎవరికీ సాధ్యంకాదు కనుక, భగవంతుని పాదాలపై పడి ప్రార్థిస్తారు ఇట్టివారు. వీరి ప్రార్థనలో కూడా దుఃఖం కలుగుతుంది. ఈ దుఃఖం పై దుఃఖంకంటె శ్రేష్ఠమైంది. కాని, ఇందులో కూడా భగవంతుడు సాధనమాత్రుడే - తమ సాధనలో ఒక ఉపకరణం మాత్రమే - కాని పరమ ప్రయోజనం మాత్రం కాదు. వీరి ప్రేమ ప్రయోజనంపై ఉంటుందికాని, భగవంతునిపై ఉండదు. భగవంతునియందు విశ్వాసమూ, గౌరవమూ, శ్రద్ధా మొదలైనవి అపరిమితంగా ఉంటాయి. తమ కోరిక నెరవేరుస్తున్నాడు కనుక, కృతజ్ఞతా ఉంటుంది. అయినా, ఇక్కడ భగవంతుడు సాధనం - ఉపాయం - మాత్రమే. ప్రయోజనం మాత్రం మోక్షం. ప్రేమ ఎప్పుడూ ప్రయోజనంపైనే ఉంటుంది కాని, సాధనంపై ఉండదు.

ఇక అయిదవరకపు దుఃఖం- ఈ రకమైన దుఃఖం కలవారికి విశ్వాసమూ, శ్రద్ధా, గౌరవమూ, మొదలైనవన్నీ భగవంతునియందే కేంద్రీకరింపబడి ఉంటాయి.

వీరికి భగవంతునివల్ల సంపాదించవలసిన ప్రయోజనం అంటూ వేరే ఉండదు. సర్వ ప్రయోజనాలకూ ప్రయోజనం అయిన భగవంతుడే వీరి పరమప్రయోజనం. పరమాత్మ యొక్క దర్శన స్పర్శన ఆలాపాదులు లేకుండా వీరు ఒక్క క్షణం కూడా బ్రతకలేరు. అవి లభించటం కోసమే అపారంగా దుఃఖిస్తారు. ఈ దుఃఖమే అత్యున్నతమూ ఉత్తమోత్తమమూ అయిన దుఃఖం.

ఇక్కడ ఆలోచించి తెలుసుకోవలసిన అంశం మరొకటి ఉంది. సంకీర్తన ప్రారంభించిన కొంతసేపటి వరకూ మామూలుగానే ఉంటుంది. హృదయంలో భక్తి బీజం ఉండటంవల్ల, కొంతసమయం గడిచాక, హృదయం కొద్దిగా కరగటం ఆరంభం అవుతుంది. ఉత్తమభక్తిలో కన్నులవెంట నీరు కారుతుంది అన్న విషయం అతః పూర్వమే తెలిసి ఉండటంవల్ల, కన్నుల వెంట ఒక నీటి బొట్టు రాగానే, తన భక్తి ఉత్తమశ్రేణికి చెందింది, ఇక ఫరవాలేదు- అన్న అహంకారం దాని వెంటే సిద్ధం అవుతుంది. ఇక, అందరూ తన భక్తిని చూచి ఆశ్చర్య పడాలి అన్న అభిప్రాయంతో, ఆ కన్నీటిని తుడుచుకోకుండా, ఇంకా దుఃఖాన్ని పెంచుకోవటానికే ప్రయత్నిస్తాడు. దీనికి ఫలం భక్తి పూర్తిగా దెబ్బతినటమే. దీని

వల్ల, హృదయం దుర్బలమై పోతుంది. కనుక, సాధకుడు ఈ విషయంలో అత్యంత జాగ్రత్త వహించాలి.

బాబూ! ఇప్పటికే లేఖ చాలా పెద్దదైంది. జాగ్రత్తగా చదువుకో. ఇంకా సందేహాలు ఉంటే వ్రాయి.

అందరికీ శుభాశీస్సులు-

సర్వజనశ్రేయోఽభిలాషి
సీతారాం

## 16

ఏలూరు

శ్రీరస్తు: చిరంజీవిని..............తల్లికి:
ప్రేమపూర్వక నారాయణ స్మరణములతో
ఆశీర్వదించి: ఉభయకుశలోపరి:

అమ్మా!

జన్మదినోత్సవానికి మీరంతా రావటం నాకు ఎంతో ఆనందాన్ని కలిగించింది. నిన్న నువ్వు ప్రయాణమై వెళుతూ, నా చేతికి ఒక లేఖ ఇచ్చావు. ఆ లేఖ చదవ బోతూంటే, "ఇప్పుడే చదవకండి. నేను వెళ్ళిన తరువాత చదవండి" అన్నావు. అప్పుడే ఊహించుకున్నాను - అది నీ వివాహ విషయం అని.

నీ లేఖ చదవగానే నాకు చాలా ఆశ్చర్యం అయింది; ఎంతో ఆనందమూ కలిగింది. కాని, ఇది చాలా ఆలోచించి నిర్ణయం చేసుకోవలసిన విషయం మాత్రం అవును. "కేవలం కృష్ణపరమాత్మే నాకు భర్త. ఇది నా నిశ్చయమైన నిర్ణయం. ఇది ఇక మారదు" అని వ్రాశావు. దీనికి సలహా ఇవ్వటం చాలా కష్టం. కాక, నిశ్చయం అయిన తరువాత సలహా అనవసరం. అయినా, నువ్వు బాగా ఆలోచించుకోనటం కోసం వ్రాస్తున్నాను. నువ్వుకూడా వ్రాయమన్నావు కదా!

ఇది కేవలం పరమార్థం అవటమేకాక, పరమార్థ విషయాల్లోకూడా ఇంతకంటె గొప్పది ఇంకొకటిలేదు. అందువల్ల, ఇది కూడదు అనటానికి ఎవరికీ అధికారం లేదు. ఇది సాధించినవాళ్ళు కృష్ణావతారకాలంలో, బృందావనలీల సమయంలో గోపికలూ, ద్వారకాలీల సమయంలో రుక్మిణి మొదలైన అష్ట పట్టమహిషులూ, పదహారువేల నూరుమంది రాచకన్యలూ. ఇది కృష్ణ పరమాత్మ యొక్క విభవావతారకాలంలో జరిగిన విషయం. కాక, అర్చావతారకాలంలోకూడా శ్రీ గోదా దేవి, మీరా మొదలైనవారు ఉన్నారు. వీన్ని

సాధించటం సులభమే కాని, ఈ ప్రాకృత జగత్తులో కష్ట సాధ్యంగా కనపడుతుంది.

పరమాత్మను పొందటానికి తపస్సులూ, యోగాలూ మొదలైనవి చాలవు; అక్కరలేదు కూడా. పరమాత్మ కోరేది నిజమైన హృదయం. నిష్కల్మషమూ పరిపూర్ణమూ అయిన హృదయం కావాలి పరమాత్మకు. హృదయంలో ఇంకొక కోరికకు ఎంతమాత్రమూ తావులేకుండా, "కృష్ణపరమాత్మే భర్త కావాలి" అన్న కోరిక తీవ్రమూ, తీవ్రతరమూ, తీవ్రతమమూ అయి హృదయం అంతా నిండిపోవాలి. దీన్నే పరమప్రేమ అంటారు. చాలు. ఇక, ఆయన నీకు వశుడైపోయాడన్న మాటే. ఏమీ సందేహంలేదు. ప్రేమ అలా పరిపూర్ణం అయినప్పుడు, అది దేశమూ, కాలమూ, వస్తువూ, అవస్థా మొదలైనవాటిచేత ఎంతమాత్రమూ బాధింపబడదు. ఇంతకంటె ఏ అర్హతా అక్కరలేదు. నిజానికి ఇంతకంటె మించిన అర్హత లేనేలేదు. కాదు. అసలు ఇది ఒక్కటే అర్హత.

ప్రాపంచికంగా వధూవరులు ఒకరినొకరు వరించుకొనటంలో, కేవలం ఇంద్రియసుఖాల మీద కోరిక ముందు ఉండి నడుపుతుంది వాళ్ళను. ఈ స్థితిలో

ఒకొక్కప్పుడు - తాత్కాలికమైన ఉద్రేకానికి లోబడి నప్పుడు - హద్దులుమీరి వక్రమార్గాల వెంటపడి ఒకరి నొకరు వరించుకోటం జరుగుతుంది. ఇప్పటి కలుషిత వాతావరణంలో దాన్ని ప్రేమించుకోవటం అనుకుంటే అనుకోవచ్చు. ఎంత సక్రమమైన పద్ధతిలో, ఎంత నిష్కల్మషంగా వరించినా, అది ప్రాపంచిక వ్యవహారమే అవుతుంది. ఇంద్రియ సుఖమే దానికి ప్రధానం అవుతుంది. ఇలా ప్రాపంచికంగా వరించుకున్న భార్యా భర్తలు మంచివాళ్ళైతే, తమ దాంపత్యాన్ని పరమార్థ ప్రయోజనానికై ఉపయోగించుకోవచ్చు. కాని, దీని స్వరూపం మాత్రం ప్రాపంచికమే.

పరమాత్మనే భర్తగా వరించటంలో శారీరక సౌఖ్యాలమీద కోరిక ఏమాత్రమూ ఉండరాదు. అసలు ఆ స్పృహకూడా పనికిరాదు. అట్టి స్పృహ ఉన్నంత కాలం ఆ ప్రేమ నిష్కల్మషమూ, పరిపూర్ణమూ కాదు.

తాను పరమాత్మకు సేవ చెయ్యటంలో, ఆయన ఇష్టాన్ని గ్రహించి, ఆయన ఆనందంకోసమే చెయ్యాలి. పరమార్థ విషయంలో అయినాసరే, స్వార్థం పనికిరాదు. పరమాత్మ సేవాభాగ్యాన్ని ప్రసాదించినా, ప్రసాదించక పోయినా, పొంగటమూ, కృంగటమూ పనికిరాదు. అలా

పొంగటమూ కృంగటమూ ఉన్నంతకాలం ఇతరులయందు అసూయా, ద్వేషమూ మొదలైనవి, వాటితోపాటు భరించలేని ఇతరములైన ఇబ్బందులూ కలుగుతాయి. అట్టి స్థితిలో, తనవారిని గురించిన అపచారాన్ని ఏమాత్రమూ సహించలేని పరమాత్మ సత్యభామనువలె నానా బాధలూ పెట్టి, ఆ దోషాలను కడిగివేస్తాడు.

పరమాత్మ కేవలం దయామయుడూ, అప్రాకృత దయామృతరసం ఘనీభవించిన దివ్యమంగళ విగ్రహుడూ. నిజమే- అయితే, మానవుల ప్రాకృతదృష్టికి, పరమాత్మ దయాగుణాన్ని అర్థంచేసుకునే శక్తిలేదు. కనుక, ఆయన ఒకప్పుడు దయామయుడుగానూ, మరొకప్పుడు కఠినుడు గానూ గోచరిస్తాడు.

అందువల్లే, భవభూతి

"వజ్రాదపి కఠోరాణి
మృదూని కుసుమాదపి
లోకోత్తరాణాం చేతాంసి
కోహి విజ్ఞాతు మర్హతి ?"

అన్నాడు శ్రీరామచంద్ర ప్రభువును గురించి చెప్పే సందర్భంలో.

కనుక, పరమాత్మను భర్తగా పొందాలి అంటే, అంతఃకరణంలో ఇతరములైన కోరికలయొక్క స్పృహ కూడా ఉండకూడదు. అలా ఇతర కాంక్షల స్పృహ ఉంటే, పరమాత్మ భర్తగా లభించే అవకాశం లేదా అంటే, పరమాత్మ విభవావతార కాలంలో అలా జరగటానికి అవకాశం ఉంది. బంగారాన్ని పుటంపెట్టి బాగు చేసుకున్నట్టు, అట్టివాళ్ళను ఆయనే బాగుచేసుకుంటాడు- సత్యభామనువలె. కాని, అర్చావతార కాలంలో, ఏ విధమైన దోషమూ ఎంతమాత్రమూ లేకుండా, పరిపూర్ణత చెందితేనే, పరమాత్మ భర్తగా లభించటం జరుగుతుంది. అటువంటి మహాదృష్టం శ్రీ గోదాదేవికీ, మీరాకూ దక్కింది మనకు తెలిసినంతలో. కాని, ఇక ఎవరికీ దక్కలేదు, దక్కదు అనటం భ్రమే అవుతుంది.

శ్రీ నమ్మాళ్వార్లవంటి పురుషులూ, శ్రీ గోదా దేవివంటి స్త్రీలూ ఇక ఎప్పుడూ ఉండరు అనీ, ఉండటానికి వీలులేదనీ భావించటం కేవలం భ్రమే. ఇంత విశాల భూమండలంలో ప్రతితరంలోనూ, ఎక్కడో అక్కడ, ప్రజలకు తెలిసేట్టుగానో, తెలియకుండానో ఉండకుండా ఉండరు.

పరమాత్మను భర్తగా పొందటానికి ఏమీ కష్టం లేదు నిజానికి. దానికి కావలసింది ఒక్కటే - పైన వ్రాసినట్టు, కోరిక పరమాత్మ మీదే ఉండాలి తప్ప, ఇతరంమీదకు ఎంతమాత్రమూ పోకూడదు.

"అనన్య చేతా స్సతతం
యో మాం స్మరతి నిత్యశః
త స్యాహం సులభః పార్థ!"

అని గీతలో కృష్ణపరమాత్మ చెప్పాడు కదా!

ధనం మీదకు గాని, సుఖం మీదకు గాని, కీర్తి ప్రతిష్ఠల మీదకుగాని కోరిక ఏమాత్రం తొంగి చూచినా, సహించదు పరమాత్మ. తెరచాటున ఉండి, అది పోయేందుకు చికిత్స చేసి స్వీకరిస్తాడు. అంతేకాక, ఆయనను పొందటానికి తపస్సులూ, యోగాలూ, పాండిత్యమూ, ధనమూ, కులమూ మొదలైనవి ఏవీ అర్హతలు కావు - భక్తి ఒక్కటే అర్హత. భక్తి అంటే ప్రేమ. పరమాత్మ ప్రేమకు వశుడు. ఆ ప్రేమే లేని నాడు యోగం యోగమేకాదు; రోగమే. ఆ ప్రేమ లేనినాడు ధనం ధనంకాదు; దంధనమే. ఆ ప్రేమ లేని నాడు కులం కులంకాదు; వ్యాకులమే. అలాగే, ఆ ప్రేమ లేనినాడు జ్ఞానం జ్ఞానం కాదు; అజ్ఞానమే. అంతేకాని,

దయామయుడైన పరమాత్మను భర్తగా వరించటానికి, పొందగలగటానికి వేరే కష్టాలు ఏమి ఉంటాయి? నీ కోరికలన్నిటికీ పరమాత్మే లక్ష్యం కావాలి. నీ కోరికలన్నీ నిష్కామంగా పరమాత్మ సేవ చెయ్యాలి అన్న కోరికతో లయించాలి. ఇతర వాంఛలు ఎంత స్వల్పంగా ఉన్నా, పరమాత్మమీద ఎంత ఎక్కువ ప్రేమఉన్నా, ఇతర వాంఛల మోతాదుకు తగినంతమేరకు ఆయనయందు ఉన్న ప్రేమలో కొరతే. కోరిక ఉంటేనే ప్రేమ ఉన్నట్టు. దేనియందు ప్రేమ ఉంటుందో, ఆ ప్రేమ మోతాదుకు తగినంత తీవ్రంగా దానియందు కోరిక ఉంటుంది. దేనియందు కోరికఉందో, ఆ కోరిక తీవ్రతకు తగినంత ప్రమాదిగా ప్రేమ ఉంటుంది. ప్రేమా, కోరికా-ఈ రెంటికీ అవినాభావ సంబంధం ఉంది. పరమాత్మయందు నీకు కోరిక ఉంది అంటే, ప్రేమ ఉన్నట్టే; ప్రేమ ఉంది అంటే కోరిక ఉన్నట్టే. కనుక, పరమాత్మ యందలి ప్రేమ పరిపూర్ణం కావాలి. అప్పుడు కోరిక పరిపూర్ణం అవుతుంది. నీకు ఇతర విషయాల మీద కోరికా, ప్రేమా ఏమాత్రం ఉన్నా, ఆ మేరకు పరమాత్మయందు నీకు కల ప్రేమలో - కోరికలో - కొరత ఉన్నట్టే. ఆ కొరత అతి స్వల్పంగా ఉన్నా, అది

పరమాత్మను ప్రత్యక్షంగా అనుభవించటానికి ఆటంకమే. ఈ విషయం చాలా జాగ్రత్తగా ఆలోచించుకోవాలి. దీనికి మనోదార్ఢ్యమూ, ఇంద్రియజయమూ పూర్తిగా ఉండాలి. మనోదౌర్బల్యం ఏ మాత్రం ఉన్నా, ప్రకృతి ఎప్పుడూ ఊపిచూడటానికే సిద్ధంగా ఉంటుంది -ఎప్పుడో ఒకప్పుడు కాలు బెసగవచ్చు. కనుక, చాలాజాగ్రత్తగా ఉండాలి.

ప్రపంచంలో వెయ్యికి తొమ్మిది వందల తొంభై తొమ్మిదిమంది ప్రకృతిలో పడ్డవాళ్ళే; ప్రకృతికి లోబడ్డ వాళ్ళే. కనుక, వారు సత్త్వ రజ స్తమో గుణాలచేత నడప బడేవాళ్ళే. అట్టివారి విషయంలో, ప్రతిక్షణమూ మెలకువతో, జాగ్రత్తగా ఉండాలి. అట్టివారు తమ స్వార్థాన్ని నెరవేర్చుకోవటానికి అవకాశాలను అన్వే షిస్తూ, అట్టి అవకాశాలను కల్పించుకుంటూ, పొంచి ఉంటారు. కనుక, మనోదార్ఢ్యం పూర్తిగా కలిగేవరకూ, అట్టివారి పిడికిలిలో చిక్కకుండా చాలా జాగ్రత్తగా ఉండాలి. అట్టివారిలో కొంతమందికి కామ దుర్గుణం తప్ప, ఇతరములైన మంచి గుణాలు ఎన్నో ఉంటాయి. తమ కోరికను నెరవేర్చుకోవటానికి, మోసదృష్టితో ఎన్నో ఉపకారాలూ సహాయాలూ చేస్తూ ఉంటారు.

అంతటితో, మనోదౌర్బల్యం కలవారికి మొగమోటమి ఏర్పడి, కాలుజారటం జరుగుతుంది. అందువల్ల, అట్టి వారి విషయంలో చాలా జాగ్రత్తగా ఉండాలి.

"ఈ విషయంలో నేను పతితనైనాసరే, ఆ ప్రయత్నం మాత్రం విడిచిపెట్టను" అని వ్రాశావు. అది నాకు అర్థం కాలేదు. పతిత అంటే, ప్రయత్నం ఫలించక పోయినాసరే అని నీ ఉద్దేశ్యమా? అదే అయితే, గొప్ప పట్టుదలే. కాని, పతిత అనే పదానికి 'చెడిపోయినది' అని అర్థం. కనుక, ఆ పదాన్ని వాడకూడదు.

అమ్మ! నీ లేఖలో "నాకు ఎప్పటినుండో ఒక ప్రాణప్రదమైన కోరిక ఉంది - బృందావనానికి వెళ్ళి, అక్కడే పిచ్చిదానివలె తిరుగుతూ చనిపోయేవరకు అక్కడే ఉండిపోవాలి. బిచ్చకత్తెలా, కుక్కలా స్వామి గుమ్మంవద్ద పడిఉంటే, ఎప్పటికైనా ఆ గోపాల చక్రవర్తి దయకలగకపోతుందా, చెయ్యి విదిలించకపోతాడా అని ఆశ, ప్రభూ! నా ఈ కోరిక శీఘ్రంగా ఫలించాలని దీవించండి" అని వ్రాశావు. దీవించటానికి అభ్యంతరం ఏముంది! నీ కోరిక అత్యుత్తమమైందే. అయితే, దానిలోని సాధకబాధకాలను చెప్పటం, ఆ విషయంలో జాగ్రత్తగా ఉండాలి అని హెచ్చరించటానికే.

"ఇతరులను వివాహం చేసుకోవాలి అంటే, అసలు నా మనస్సులో కోరిక కలగటంలేదు. స్వామి నన్ను ఏం చేద్దామనుకుంటున్నాడో! ఎలా చేద్దామనుకుంటున్నాడో! సామాన్యులను ఎవరినో పెండ్లాడి, వారిలోనే భగవంతుని చూడాలంటే, స్వామీ! నాకు అంతటి యోగ్యత లేదు. ఆస్థితి ఈ జన్మకు రాదు. అందువల్ల నేను ఇక అన్యులను ఎవరినీ పెండ్లి చేసుకోలేను" అని వ్రాశావు.

అమ్మా! ఈ నిశ్చయం దృఢంగా ఉంటే, ఇక చెప్పవలసినది ఏముంది! నువ్వుకూడా "అహోభాగ్యం! అహోభాగ్యం!" అని చతుర్ముఖ బ్రహ్మదేవుని అంతటి వానితో స్తుతింపబడదగిన భాగ్యశాలినివి అయ్యావన్నమాటే! నువ్వు అంతటి దానవు కావాలి అని హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను. కాని, నువ్వు జడపదార్థానివికాదు, చేతనురాలివి. కనుక, పరమాత్మను శరణుజొచ్చి, జాగ్రత్తగా ఉండటం నీ బాధ్యత. ఆ విషయమే నేను హెచ్చరిస్తున్నాను. నీ కోరికను పరమాత్మయందు మాత్రమే ఉంచుకోవలసిన బాధ్యత నీకు ఉంది. ఆ బాధ్యతా నిర్వహణంలో నువ్వు అనుక్షణం అప్రమత్తంగా ఉండాలి.

తల్లీ! ఇంకొక విషయం వ్రాస్తున్నాను- జాగ్ర త్తగా చదువుకో- ప్రతివాడూ- స్త్రీలుకాని, పురుషులు కాని- సంస్కారాలకు లోబడే ఉంటారు సాధారణంగా. ఆ సంస్కారాల్లో ప్రాపంచికములు కొన్నీ, పారమార్థిక ములు కొన్నీ ఉంటాయి; కొన్ని ధర్మములైనవీ, కొన్ని అధర్మములైనవీ ఉంటాయి కొన్ని స్థూలరూపంలోనూ కొన్ని సూక్ష్మరూపంలోనూ ఉంటాయి.

సంస్కారాల్లో ఎక్కువ బలమైనవి ఉండి, అవి తల ఎత్తినప్పుడు, ఆ సంస్కారాలను అనుసరించి తన ఆచరణను అమలుపరచటంకోసం అవకాశాలను అన్వేషిం చటం, కల్పించుకోవటం చేస్తాడు సామాన్య మానవుడు. కొన్ని సంస్కారాలకు తగిన వాతావరణమూ, అవకా శమూ లభించినప్పుడు అవి బలంగా తలఎత్తుతాయి. అప్పుడు కూడా సామాన్య మానవుడు వాటికిలోబడి పని చేస్తాడు. ప్రాపంచిక మానవులు ఎంతో తెలివిగా ఇత రుల సంస్కారాలకు ఉద్రేకాన్ని కలిగించి, తమ పని నెర వేర్చుకుంటారు. కాక, ఒక్కొక్కప్పుడు అటు స్త్రీలకూ, ఇటు పురుషులకూ కూడా కామ్య సంస్కారాలు తల ఎత్తుతాయి. అప్పుడు ఇరువురికీ అపేక్ష కలిగి, అవకాశం దొరకగానే కాలుజారటం జరుగుతుంది. అందువల్ల,

పరమార్థం కావాలి అనుకొనేవారు సంస్కారాల విష యంలో చాలా జాగ్రత్తగా ఉండవలసిన అవసరం ఎంతైనా ఉంది.

"మనం సంస్కారాలను జయించాం. ఇక అవి మనల్ని ఏమీ చెయ్యలేవు" అని ఏమాత్రం అజాగ్రత్తగా ఉన్నా, తల్లక్రిందులుగా పడ్డారు అన్నమాటే. అందుచేత, పరమార్థ సంస్కారాలకు బలం కలిగేట్టుగానూ, క్రొత్తవి ఏర్పడేట్టుగానూ వాతావరణాన్ని కల్పించుకోవాలి. అలాగే, పరమార్థ వ్యతిరేక సంస్కారాలు నశించేట్టు గానూ, క్రొత్తవి ఏర్పడకుండా ఉండేట్టుగానూ వాతా వరణాన్ని కల్పించుకుంటూ ఉండాలి.

సంస్కారాలకు వాటికి తగిన విషయాలే ఆహారం. ఆ ఆహారం ఉన్నట్లైతే, అట్టి సంస్కారాలు వృద్ధి పొంద టమూ, క్రొత్తవి ఏర్పడటమూ జరుగుతుంది. కాబట్టి పరమార్థ సంస్కారాలు తలఎత్తినప్పుడు భాగవతాది గ్రంథాలు చదవాలి. పరమార్థ కార్యక్రమాల్లో పాల్గొ నాలి. అప్పుడు పరమార్థ సంస్కారాలు కీకారణ్యంలాగ వృద్ధిపొందుతాయి. చెడ్డ సంస్కారాలు తలఎత్తినప్పుడు చెడ్డగ్రంథాలు చదవాలి అనీ, వాటికి తగిన పనులనే

చెయ్యాలి అనీ అనిపిస్తుంది. అప్పుడు ములకువతో ఉండి, బలాత్కారంగా అయినా సరే, చెడ్డ గ్రంథాలను చదవటమూ, చెడ్డపనులు చెయ్యటమూ మానితే, ఆ సంస్కారాలు క్షీణిస్తాయి.

మానవుడు ఒక మాట మాట్లాడితే, దానికి తగిన సంస్కారాలు బలపడతాయి; క్రొత్తవి మొలకెత్తుతాయి. అలాగే, ఒక సంభాషణ వింటే, ఒక దృశ్యం చూస్తే, ఒక పని చేస్తే, ఒక గ్రంథం చదివితే, చివరకు ఏదైనా ఆలోచిస్తే వాటికి తగిన సంస్కారాలు బలపడటమూ, క్రొత్తవి మొలకలెత్తటమూ జరుగుతుంది. కనుక, పరమార్థ సంబంధములైనవే మాట్లాడాలి; పరమార్థ సంబంధములైన దృశ్యాలనే చూడాలి. పరమార్థ సంబంధములైన వాటినే వినాలి. పరమార్థ సంబంధములైన గ్రంథాలనే చదవాలి. పరమార్థ సంబంధములైన ఆలోచనలే చెయ్యాలి. పట్టుదలతో ఇలా చెయ్యగా చెయ్యగా పరమార్థ వ్యతిరేకములైన సంస్కారాలకు ఆహారం లభించక, క్రమంగా క్షీణించి, నశించిపోతాయి. పరమార్థ సంస్కారాలు బలవంతములై, అపారంగా వృద్ధి పొందుతాయి. ఆ స్థితిలో ఈ ప్రయత్నం బలాత్కారంగా చెయ్యనక్కరలేదు. అది సహజం అయిపోయింది. ఇక,

అప్పుడు లోకంలోని ఏ పరిస్థితీ, ఏ వాతావరణమూ అట్టి వ్యక్తిని చలింపచెయ్యలేదు. ఇదంతా నిన్ను నిరుత్సాహపరచటానికి కాదు - హెచ్చరికకోసం వ్రాస్తున్నాను. అట్టి మధురాతి మధురయాత్రలో వెనుకడుగు వెయ్యకుండా ముందుకు సాగాలి అని నా హెచ్చరిక. గమ్యస్థానాన్ని పొందటానికి కొన్ని జన్మలు పట్టినాసరే-పట్టుదల మాత్రం వదలకూడదు. విసుగూ, నిరాశా మనస్సై పే చూడకూడదు.

ఇందుకొరకు ఎన్ని కష్టాలనైనా భరించవలసి వస్తుంది అనటం నాకు సమ్మతంకాదు. నిజానికి, జగత్తులో కష్టాలు అంటూ ఏమీ లేవు. భ్రమ ప్రమాదాల చేత మానవుడే కష్టాలు తెచ్చిపెట్టుకుంటున్నాడు.

తనకు అవసరంలేని, అధికారంలేని, పనికిరాని కోరికలను కలిగిఉండి, మానవుడు బాధపడుతున్నాడు. తనది కానిదాన్ని తనది అనుకుంటూ, తనవారు కానివారిని తనవారు అనుకుంటూ, తాను కష్టపడుతున్నాడు. అలాగే, తనది అయినదాన్ని తనదికాదు అనుకుంటూ, దాని కోసం ప్రయత్నించడు; దాని కోసం దుఃఖించడు. ఈ స్థితి కష్టాలను కలిగిస్తుంది. పరమాత్మను పొందటానికి ప్రయత్నం చెయ్యకుండా అడ్డుపడుతుంది. అసలు ఈ

దేహమే నీదికాదుగదా ! ఇక జగత్తులో ఏది నీది ? ఎవరు నీ వారు ? నిజానికి ఇదిఏదీ నీదికాదు. ఏరు ఎవరూ నీవారు కాదు.

ఈ జ్ఞానం హృదయానికి పట్టిననాడు, ఇక నీకు కష్టం ఎక్కడిది ? హృదయానికి పట్టనినాడు, కష్టాలు కలగటమూ, వాటిని జ్ఞాన పూర్వకమైన విచారణతో నెట్టివెయ్యటమూ జరుగుతుంది. ఈ జ్ఞానం అనుభవం లోకి వచ్చిననాడు, అసలు కష్టమూ కలగదు; దాన్ని నెట్టివెయ్యవలసిన అవసరమూ ఉండదు.

జ్ఞానమే నీకు అండగా, పరమాత్మే నీకు రక్షకుడుగా ఉండుగాక ! మధురాతి మధురమైన ఈ యాత్రలో మధురాతి మధురస్వరూపుడైన ఆ మధురానాథుని పొంది సుఖింతువుగాక ! ఇవే నా హృదయ పూర్వకమైన శుభాశీస్సులు.

సర్వులకూ సదా మేలుకోరు
సీతారాం

# 17

గన్నవరం.

శ్రీరస్తు : చిరంజీవిని..........తల్లికి :
ప్రేమపూర్వక నారాయణ స్మరణములతో
ఆశీర్వదించి : ఉభయకుశలోపరి :

ప్రియమైన తల్లీ !

నువ్వు వ్రాసిన లేఖ అందింది. "నా చిన్నతనంలో- పది పన్నెండు సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు - తమ సంకీర్తన చూచాను; ఆ తరువాత ఎన్నడూ చూచే అదృష్టం కలగ లేదు" అని వ్రాశావు. అమ్మా! ఆసక్తి తీవ్రతమం చేసుకో -చాలు-ప్రతి క్షణమూ నా సంకీర్తన చూడటమే కాదు, అందులో పాలుపంచుకోగలుగుతావు కూడా.

నేను దాదాపు సంవత్సరానికి రెండు మూడు మార్లైనా ఏలూరు వస్తూనే ఉంటాను. మొన్న మీరు ఉంటున్న వీథిలోని ఒకరి ఇంట్లో సంకీర్తన కూడా జరిగింది. బహుశః మీకు తెలియదేమో! అన్నట్టు ఆ వీథిలోకి క్రొత్తగా వచ్చినట్టు వ్రాశావు కదా!

అమ్మా! నీ లేఖలో కొన్ని సందేహాలను గురించి వ్రాశావు. నాకు తోచినరీతిలో వాటికి సమాధానం వ్రాస్తాను - జాగ్రత్తగా చదువుకో.

"పూజామందిరంలో దేవుని పటం పెట్టుకొని పూజించుకోవచ్చా?" అని వ్రాశావు. నిరభ్యంతరంగా పూజించుకోవచ్చు. అందులో దోషమేమీ లేదు. అందుకు ఎవరి అనుమతీ అక్కరలేదు. అయితే, మంత్ర జపం చేసుకోవాలి అంటే మాత్రం ఎవరినో ఒకరిని గురువుగా ఆశ్రయించి ఉపదేశం పొందాలి. నిజానికి గురువును ఆశ్రయించనిదే పరమార్థం లేదు. సర్వ సంప్రదాయాలూ అంగీకరించే విషయమే ఇది. అయితే, ఆ గురువు పరమార్థానుభవం కలిగినవాడై ఉండాలి. కనీసం, సక్రమమైన విధానంలో సాధనచేసే ఉత్తమ సాధకుడు అయినా అయి ఉండాలి. నీ భర్తకు 'గురువులు' అంటే ఇష్టంలేదు అని వ్రాశావుగదా! ఎందువల్ల ఇష్టంలేదు? ఆయనకు పరమార్థం అక్కరలేదు కనుకనా? పరమార్థం కావలసినా, గురువును ఆశ్రయించటం ఎందుకు అనా? లేక గురువులుగా పరిగణింపబడుతున్న వారిలో తామెరిగిన కొందరి ప్రవర్తననుబట్టి గురువులు అనబడేవారందరినీ గురించిగాని, వారి శిష్యులను గురించి

గాని ఏర్పడిన సందేహాలవల్లనా? ఆయనకు ఎందువల్ల ఇష్టంలేదో? - జాగ్రత్తగా విచారించి చూస్తే పర మార్థం కావాలి అనుకొనేవారు అందరూ గురువును ఆశ్రయించే తీరాలి.

"గురువు బాధ్యత ఎంతవరకు? పిల్లలకు విద్య నేర్పినట్లేనా, లేక వార్తాపత్రికలో వ్రాసినట్లు అక్క డక్కడ జరగటం నిజమేనంటారా?" అని వ్రాశావుతల్లీ!

'వార్తాపత్రికలో వ్రాసినట్లు' అంటే నాకు అర్థం కాలేదు. ఏ వార్తాపత్రికలో ఎవరు వ్రాశారో, ఏమి వ్రాశారో నీ లేఖలో వ్రాయలేదు. కనుక, దానికి సమా ధానం వ్రాయటం సాధ్యంకాదు. ఆ విషయం నువ్వు వివరంగా వ్రాస్తే, సమాధానం వ్రాస్తాను.

ఇక, గురువుయొక్క బాధ్యత ఎంతవరకు అంటే, శిష్యులకు యథార్థమైన పరమార్థజ్ఞానం లభించేట్లు చెయ్యటం, పరమార్థానుభవం కలిగేట్లు చెయ్యటం గురువుయొక్క బాధ్యత. పరిపూర్ణ భగవదనుభవంకలగక పోయినా, పరమార్థజ్ఞానం సంపూర్ణంగా కలిగి ఉండి, సాధనచేసే ఉత్తమ సాధకుడు అయితే, చక్కని ప్రబో ధాలతో శిష్యుని జ్ఞానసంపాదనకు తోడ్పడి, జ్ఞానాన్ని కలిగించ గలడు.

పరమార్థజ్ఞానం కలిగిఉండటమేకాక, పరమార్థానుభవంకూడా కలిగిఉన్న గురువు అయితే ప్రబోధంతో జ్ఞానాన్ని కలిగించటంతోపాటు, అనుగ్రహంతో అనుభవాన్ని కూడా ప్రసాదించగలడు. అయితే, గురువు ఎంత గొప్పవాడు అయినా, గురువు విషయంలో శిష్యునికి ఉండే విశ్వాసమూ, భక్తీ, శ్రద్ధా - వీటి మోతాదును అనుసరించే శిష్యునికి ఫలం లభిస్తుంది.

అందువల్లే,

"యస్య దేవే పరాభక్తిః
యథా దేవే తథా గురౌ
తస్యైతే కథితా హ్యర్థాః
ప్రకాశంతే మహాత్మనః"

'ఎవరికి దైవమునందు పరమభక్తి ఉంటుందో, దైవమునందువలె గురువునందుకూడా ఉంటుందో, అట్టి మహాత్ములకు ఉపదేశింపబడిన విషయాలు ప్రకాశిస్తాయి' అని శ్రుతి ఉపదేశించింది. విషయాలు తెలియటం అంటే జ్ఞానం; తెలిసిన విషయాలు ప్రకాశించటం అంటే అనుభవంలోకి రావటం అని అర్థం.

అమ్మా! నీకు దైవాన్ని గురించిన కలలు వస్తున్నాయని వ్రాస్తూ, "అట్టికలలు దైవచింతనలో ఉండటం వల్ల వస్తాయా, లేక ఎందువల్ల ?" అని ప్రశ్నించావు.

ఇష్టానికి తలచుకున్నంత మాత్రాన కలలు రావు. అలావస్తే, మనకు ఏది ఇష్టమో, దాన్ని తలచుకోవచ్చు. దాన్ని గురించిన కలలు వస్తే సంతోషించవచ్చు. కాని, అలా జరగదు. కలలు రావటానికి అనేక కారణాలు ఉండవచ్చు.

అనేక జన్మలనుండి అంటిపెట్టుకుని వస్తున్నవీ, ఈ జన్మలో క్రొత్తగా కలిగినవీ అయిన సంస్కారాల మూలంగా కలలు వస్తాయి. కాని, ఏ యే సంస్కారాలు ఎప్పుడెప్పుడు కలలరూపంలో వస్తాయో తెలుసుకోవటం సామాన్యబుద్ధికి అందని విషయం. అయితే, సంస్కారాలన్నీ కలలుగా రావాలనే నిర్ణయం కూడా లేదు. కొన్ని రావచ్చు; కొన్ని రాకపోవచ్చు.

మానవుడు అనేక దృశ్యాలు చూస్తాడు, మాట్లాడతాడు, వింటాడు, పనులుచేస్తాడు, ఆలోచిస్తాడు. ఇవన్నీ సంస్కారాలుగా చిత్తం మీద పడతాయి. కొన్ని సంస్కారాలు బలంగా పడతాయి; కొన్ని తేలికగా పడతాయి. ఏ దృశ్యం చూచినా, ఏ సంఘటన జరిగినా,

మానవుని చిత్తం మంచిగానో చెడ్డగానో, సంతోష రూపంలోనో, దుఃఖరూపంలోనో, వికారానికి లోనౌతుంది. ఆ వికారమే సంస్కారంగా రూపొందు తుంది. అట్టి సంస్కారాలు - బలంగా పడినవి త్వరలో కలలరూపంలో రావచ్చు. సామాన్యంగా పడినవి ఆలస్యంగా అయినా, ఈ జన్మలోనే రావచ్చు. మరీ తేలికగా పడినవి ఈ జన్మలో కాక, తరువాతి జన్మల్లో రావచ్చు. అలాగే, ఇప్పుడు వచ్చే కలల్లో క్రిందటి జన్మలలోని తేలిక సంస్కారాలకు సంబంధించినవి ఉండ వచ్చు. కొన్ని సంస్కారాలు తేలికగాపడినా, బలంగా పడినా కలలరూపంగా రాకనేపోవచ్చు. వీటిగురించి ఇంతకంటె 'ఇద మిత్థం' అని చెప్పటం కష్టం. వీటిలో కొన్ని కలలు జీవితంలో శుభానికి సూచనలు కావచ్చు. అలాగే, కొన్ని కలలు జీవితంలో దుఃఖానికి సూచనలు కావచ్చు. నీకు దైవసంబంధములైన కలలు వస్తే, అవి మంచికే సూచనలు కావచ్చు.

అమ్మా! చాలా తొందరలో ఉండి ఈ లేఖ వ్రాశాను - నీ ఇతర ప్రశ్నలకు సాధ్యమైనంత త్వరలో సమాధానం వ్రాస్తాను.

అందరికీ శుభాశీస్సులు.

సదా మీ మేలుకోరు
సీతారాం

# 18

శ్రీరస్తు : చిరంజీవి..............కి :
ప్రేమపూర్వక నారాయణస్మరణములతో
ఆశీర్వదించి: ఉభయకుశలోపరి :

ప్రియమైన బాబూ !

నీకు ఒకవిషయం వ్రాస్తున్నాను- జాగ్రత్తగా చదువుకో.

మానవుడు ఈ లోకంలో జాగ్రత్తగా మెలగటం నేర్చుకుంటేగాని, పరమార్థం సంపాదించలేడు. జాగ్రత్తగా మెలగటం అంటే ఏమిటి ?

పరమాత్మ మానవునకు కర్మేంద్రియాలు అయిదూ, జ్ఞానేంద్రియాలు అయిదూ, మనస్సు ఒకటీ ప్రధాన పరికరాలుగా ఇచ్చాడు. వాటిని సక్రమంగా వినియోగించుకోగలగటమే జాగ్రత్తగా మెలగటం అంటే.

పరమాత్మ ప్రసాదించిన ఈ పరికరాలను కేవలం మోక్ష సంపాదనకొరకే ఉపయోగించుకోనటం, లోక

వ్యవహారాల్లో ఉపయోగించుకొనేప్పుడు, మోక్షసంపాదనకు ప్రతిబంధకాలు కాకుండా చూచుకొనటం మానవుని బాధ్యత. వీటిని తన హితం కోసం ఉపయోగించుకొనేవాడే నిజానికి తెలివికలవాడు.

ఉదాహరణకు వాక్కును గురించి చెప్పుకుందాం.- మాట్లాడేప్పుడు మోక్షసంపాదనకు ఉపయోగపడేవే మాట్లాడాలి. కాక, ప్రతిబంధకం కాకుండా అయినా చూచుకోవాలి. ఎవరితో ఏ వ్యవహారాన్ని గురించి మాట్లాడుతున్నా, మాట్లాడే విధానం మోక్షసంపాదనకు ఉపయోగపడుతూ, వ్యావహారిక ప్రయోజనం నెరవేరేట్టుగానూ,తగాదాలు రాకుండా ఉండేట్టుగానూ మాట్లాడటం ఉత్తమం. మోక్షసంపాదనకు ఉపయోగపడకపోయినా ప్రతిబంధకం కాకుండా చూచుకొంటూ, వ్యావహారిక ప్రయోజనం నెరవేరేట్టూ, తగాదాలు రాకుండా ఉండేట్టూ మాట్లాడటం మధ్యమం. కేవలం వ్యావహారిక ప్రయోజనం మాత్రం నెరవేర్చుకుంటూ, తగాదాలు రాకుండా చూచుకుంటూ, మోక్ష సంపాదనకు ప్రతిబంధకంగా మాట్లాడటం అధమం. మోక్షసంపాదనకు ఉపయోగపడకపోగా, ప్రతిబంధకం అయ్యేట్టూ, వ్యవహారాలు చెడేట్టూ తగాదాలు వచ్చేట్టూ మాట్లాడటం అధమాధమం.

"నేను ఉన్నది ఉన్నట్టు మాట్లాడతాను - ఎవరు ఏమనుకున్నా నాకు భయంలేదు" అంటూంటు చాలామంది. కాని, అది సరికాదు. ఉన్నది ఉన్నట్టు ప్రతివిషయమూ మాట్లాడవలసిన అవసరం ఏముంది? అలా మాట్లాడటం చేత తనకైనా ప్రయోజనం ఉండాలి, ఇతరులకైనా ప్రయోజనం ఉండాలి. ఎవరికీ ప్రయోజనం లేకపోగా, పై పెచ్చు తగాదాలకు కూడా కారణం అయ్యేట్టు మాట్లాడటం మంచిపని కాకపోవటమేకాదు; చెడ్డపని కూడా నా అభిప్రాయంలో.

లోకస్వభావం ఎక్కువగా ఎలా ఉంటుంది అంటే, మాట్లాడింది సత్యమా, అసత్యమా అని చూడరు. లెక్క లేకుండా మాట్లాడితే సహించలేకపోవటం, దానివల్ల ద్వేషం కలిగి ఉండటం జరుగుతుంది. ఏది ఎలా జరగాలో అది అలా జరిగిపోతుంది. దాన్ని మార్చలేనప్పుడు - నువ్వు చెప్పినదానిలోని మంచిని ఇతరులు గ్రహించలేనప్పుడు నువ్వు చెప్పటం ఎందుకు? నీమీద ద్వేషమూ, అసూయా కలిగించుకోవటం ఎందుకు? నీ సంభాషణ వల్ల ఇంతకంటె ప్రయోజనం ఏముంది? నీకు ఐహికంగా శాంతిలేకపోవటం, తగాదాలూ ఇబ్బందులూ కలగటం, మోక్షసంపాదనకు భంగం కలగటం- ఇంతేగదా ప్రయో

జనం! అయినా, దీన్ని ధైర్యంగా మాట్లాడటం అనుకో వచ్చు. ధైర్యం అయితే కావచ్చుగాని, దాన్ని పూర్తిగా దుర్వినియోగం చెయ్యటమే అవుతుంది. నష్టం వచ్చినా భయపడను అంటావా, అది తెలివితక్కువతనమే అవుతుంది. ఏదైనా ఒక నష్టం కలిగినప్పుడు, దాన్ని అంగీకరించటంవల్ల అంతకంటె ప్రధానమైన ప్రయోజనం ఇంకొకటి ఏదైనా ఉండాలి. దీనివల్ల లాభం లేకపోగా, పరమార్థం చెడుతోంది.

"నా స్వభావం ఇంతే. ఏం చెయ్యను?" అంటావా' అవతలివారు కూడా ఇదే మాట అంటారు. అవతలివారు తమ స్వభావాన్ని మార్చుకోవాలి, తాను తన స్వభావాన్ని మార్చుకోనక్కరలేదు అనుకోవటంకంటె తెలివి తక్కువతనం ఇంకొకటి లేదు.

నువ్వు జాగ్రత్తగా మాట్లాడటం నేర్చుకుంటే, ఇతరులు బాగుపడకపోయినా, బాగుపడటానికి అవకాశాలు ఏర్పడవచ్చు. లేకపోతే, ఉన్న అవకాశాలు కూడా చెడిపోతాయి. మంచి అవకాశాలను కల్పించుకొనటంలో తెలివి ఉందికాని, ఉన్న అవకాశాలను కూడా పాడుచేసుకుని, చిక్కులపాలై, చిత్తశాంతి లేక బాధపడటం, తెలివితక్కువతనమే అవుతుంది. ద్వేషమూ, అసూయా

చిత్తంలో కలిసి, చాలాకాలంగా ఉండటంచేత అదే స్వభావంగా మారిపోతుంది. అప్పుడు, ఒకవేళ మార్చు కుందాం అనే అభిప్రాయం కలిగినా, మార్చుకోలేరు.

తనకు నష్టంలేనంతవరకు అయినా ఇతరుల దోషాలను చూడకపోవటం, కనపడినా వాటిని మనస్సుకి రానియ్యకపోవటం, ఇతరుల దోషాలను క్షమించగలగటం మానవుని పునీతుణ్ణి చేస్తాయి. అట్టివాడు ఐహికంగా, పారమార్థికంగా పురోగమించగలుగుతాడు. "ఇతరుల దోషాలను వారికి చూపి, సరిదిద్దటం తప్పా?" అని అడగవచ్చు. ఇతరులు వింటే చెప్పవచ్చు. కాని, అనవసరంగా చెప్పటం అనధికారకృత్యమే అవుతుంది. అవసరం లేకపోయినా, ఏదో ఒక సంబంధం కల్పించు కొని, ఇతరుల దోషాలను గురించి ఉన్నవీ లేనివీ అంటూ ఉంటే, వారికి నీ మీద సద్భావం ఎలా ఉంటుంది? అందరినీ శత్రువులుగా చేసుకొనే ఈ విధమైన మనః ప్రవృత్తి కలవారికి చిత్తశాంతి ఎక్కడా లభించదు, ఏ విధమైన సహాయమూ లభించదు. అట్టివారు తమ పనులు చెడిపోవటానికి తామే కారణభూతులు అవుతారు. ఎవరైతే ఇతరులతో జాగ్రత్తగా మెలుగుతారో, వారికి

అందరూ మిత్రులే అవుతారు - ఎవరో రాక్షస ప్రవృత్తి కలవారు తప్ప.

నీ మీద ద్వేషమూ, అసూయా హృదయంలో తిష్ఠ వేసుకున్న తరువాత, నువ్వు నిజంగా వారి హితాన్నే కోరి చెప్పినా, వ్రాసినా, నువ్వు అన్న ప్రతి మాటా, వ్రాసిన ప్రతి వ్రాతా వారికి విషమిస్తూనే ఉంటుంది.

కనుక, నేను చెప్పినట్టు జాగ్రత్తగా మాట్లాడటం నేర్చుకుంటే, సుఖపడతావు. సందేహాలు ఏవైనా ఉంటే వ్రాయి - సమాధానం వ్రాస్తాను.

అందరికీ శుభాశీస్సులు.

సదా మీ మేలుకోరు
**సీతారాం**

# 19

శ్రీకృష్ణాశ్రమము

శ్రీరస్తు : చిరంజీవిని..............తల్లికి :
ప్రేమపూర్వక నారాయణ స్మరణములతో
ఆశీర్వదించి : ఉభయకుశలోపరి :
అమ్మా ! ఈ ప్రపంచమే అశాశ్వతం. ప్రపంచం

అంటే కేవలం ఈ లోకం ఒక్కటే కాదు - బ్రహ్మలోక పర్యంతములైన ఊర్ధ్వలోకాలు కూడా ఈ ప్రపంచం లోనివే. బ్రహ్మలోకాదులే అశాశ్వతములు అయితే, ఇక ఈ లోకాన్ని గురించి వేరే చెప్పాలా! బ్రహ్మ లోకాది ఊర్ధ్వలోకాలకంటె కూడా క్షణభంగురం ఈ లోకం. అట్టి ఈ లోకంలో దేన్ని నమ్ముకొని మనస్సును శాంతంగా ఉంచుకోవాలి? స్థిరత్వంలేని ఈ ప్రపంచంమీద ఆధారపడి ఉన్న మనస్సుకు స్థిరత్వం ఎలా కలుగుతుంది?

జీవులు అందరూ బంధనాన్ని అనుభవించటానికి శిక్షారూపంలో ఈ లోకంలోకి పంపబడుతున్నారు. అట్టి ఈ లోకంలో దుఃఖమే తప్ప, సుఖమూ, ఆనందమూ ఎలా కలుగుతాయి? ఈ లోకంలోకి బంధితులుగా వచ్చిన జీవులు - మానవులు - ఇంద్రియ విషయాలకు లోబడి, ఏవేవో సంబంధాలు సృష్టించుకుని, ఎప్పుడో ఒకప్పుడు ఈ లోకాన్ని విడిచిపెట్టిపోవలసినవాళ్ళమే అన్న ఆలోచనలేక బాధపడుతూ, ఇక్కడ సుఖం లేక పోయినా, భ్రాంతి చేత సుఖం కానిదాన్ని సుఖం అను కుంటూ సంసారసాగరంలో మునిగితేలుతున్నారు.

మానవుల బాధ్యత ఇంతమాత్రమే అయితే, పశుపక్ష్యాదులకూ, మానవులకూ భేదం ఏముంది ? మానవులు తరించటంకోసం పరమాత్మ ఒక ఏర్పాటు చేశాడు. అందులో ప్రధానమైంది వివాహసంస్కారం. స్త్రీ పురుషులు ఇరువురూ ఇంద్రియజయం లేక పశు పక్ష్యాదుల వలె స్వేచ్ఛగా సంచరిస్తూ జన్మను దుర్వి నియోగపరుచుకోక, క్రమపద్ధతిలో అదుపు ఆజ్ఞలలో విషయాలను అనుభవించటానికి ఏర్పడింది వివాహ సంస్కారం. ఈ విధానంలో విషయాలను అనుభవించే వారిని గృహస్థులు అంటారు. ఇలా సక్రమంగా నడచు కొనేవారే భగవంతుని అదుపు ఆజ్ఞలలో విషయాలను అనుభవించేవాళ్ళు. అందువల్ల, వీరు ఆస్తికుల దృష్టిలో నేరస్థులుకారు - ఈ విశ్వాసంలేనివారి దృష్టిలో ఎవరూ నేరస్థులుకారు అనుకోండి !

గృహస్థులు తాము విషయాలను జయించలేని దౌర్బల్యం కలవారు అవటంచేత, కృపాదృష్టితో భగ వంతుడే తమకు ఈ అవకాశాన్ని ప్రసాదించాడు అన్న సత్యాన్ని సదా జ్ఞాపకం ఉంచుకొంటూ, మహాత్ముల వల్ల జ్ఞానోపదేశం పొందుతూ, ఈ లోకమూ, సంపదా, ఈ వ్యక్తులూ, వ్యక్తులలో కల పరస్పర సంబంధమూ -

అంతా క్షణభంగురమే అని తెలుసుకొని, భగవదనుభవం ముందు ఇహలోక సుఖాలేకాక, బ్రహ్మలోక పర్యంతము లైన భోగాలు కూడా తుచ్ఛములే అని గ్రహించి, భగవంతునికి ఇష్టమైనరీతిలో ఈ లోకంనుండి వెళ్ళి పోవటానికి అందరూ సిద్ధంగా ఉండాలి - ఇదీ ఆస్తిక లైనవారి నిజస్థితి.

అమ్మా! దంపతులైన మీరు ఇరువురూ చక్రాంకనపరులై భగవంతునివారు అయ్యారు. మీభర్త గారు భగవంతునిమీద అచంచలమైన విశ్వాసంతో జీవితాన్ని గడుపుకొని, భగవంతుని సన్నిధికి చేరారు. మీరు ఈ జ్ఞానాన్ని అనుక్షణం జ్ఞాపకం ఉంచుకొంటూ పరమార్థానికి భంగం కలగనిరీతిలో ఐహిక జీవితాన్ని గడుపుకొంటూ ధన్యులుకండి! మీరు భగవంతునికి చెందినవారే. మీరు ఏపని చేస్తున్నా, భగవంతుణ్ణి జ్ఞాపకం ఉంచుకోండి. ఇక మీకు మోక్షం కరతలా మలకమే.

అమ్మా! నన్ను మరిచిపోకండి. మీ పిన్న అత్త గారు నన్ను కన్నకుమారుని వలె ప్రేమగా చూస్తుంది. ఆమె కుశలంగా ఉన్నారని తలుస్తాను. అవసరమైతే లేఖ

వ్రాయండి. వీలుచూచుకుని సమాధానం వ్రాస్తాను.

అందరికీ హృదయపూర్వకమైన శుభాశీస్సులు.

సదా మీ మేలుకోరు

సీ తా రాం

## 20

న ర్సా పు రం

శ్రీరస్తు: చిరంజీవిని............తల్లికి:

ప్రేమపూర్వక నారాయణ స్మరణములతో

ఆశీర్వదించి: ఉభయకుశలోపరి:

ప్రియమైన తల్లీ !

నా ఆరోగ్యం కొంతవరకు నయమే. వయస్సును బట్టీ, ఎండలనుబట్టీ చాలా బడలికగానే ఉంది. అయినా అంతగా ఇబ్బందిలేదు. పనులు ఏమీ ఆగటంలేదు. పరమాత్మ త్రాడుచుట్టి వేసిన వేగాన్నిబట్టి ఈ బొంగరం ఇంకా తిరుగుతూనే ఉంది. ఎంతకాలం ఇలా తిరుగుతుందో! వేగం పూర్తిగా తగ్గనిదే ఆగదు; వేగం పూర్తిగా తగ్గితే, ఇక తిరగదు. ఈలోపల జబ్బులు ఏమి చేస్తాయి? బడలిక లేమి చేస్తాయి? పరమాత్మ అప్పజెప్పిన పని అయిపోగానే మళ్ళీ స్వస్థానానికి పోవలసిందేగదా !

జాగ్రత్తగా ఆలోచిస్తే, మానవుడు భగవన్నామం చేతనే తరిస్తాడు. అయితే, ఇక్కడ గమనించవలసిన ముఖ్య విషయం ఒకటి ఉంది.

వెనుకటి జన్మల పుణ్యపాపాలు ఉంటే, ప్రారబ్ధ కర్మానుభవ రూపంగా తోమి శుభ్రంచేసి తన దగ్గరకు తీసుకుంటాడు మానవులను భగవంతుడు.

పుణ్యానుభవం, పాపానుభవం - రెండూ తమను పరిశుద్ధుల్ని చేసే పరికరాలే - భగవంతుణ్ణి ఆశ్రయించి, ఆయన నామానికే జీవితాన్ని అంకితం చేసుకున్నవారికి.

మసి బాగా పట్టి ఉంటే పాత్రను ఇసుకతోనూ, ఇటుకరాతి పొడితోనూ తోముతారు. మసి తక్కువగా ఉంటే సున్నంతోనూ, సబ్బుతోనూ తోముతారు. కష్టాలు, నష్టాలు, దారిద్ర్యం, అపనిందలు, దూషణలు మొదలైనవి అనుభవిస్తే పాపం అనే మసి వదలిపోతుంది.

సుఖాలు, లాభాలు, ఐశ్వర్యం, పొగడ్తలు, పూజలు మొదలైనవి అనుభవిస్తే పుణ్యం అనే మసి వదలిపోతుంది. జీవుల్ని ఇలా తోముకుని భగవంతుడు దగ్గరకు తీసుకుంటాడు.

కాని, జాగ్రత్తగా ఉండవలసింది ఎక్కడంటే, ప్రారబ్ధం అనుభవించేప్పుడు ఇష్టమైనవైతే రాగమూ, ఇష్టం కానివైతే ద్వేషమూ కలుగుతూ ఉంటే మాత్రం అదివరకున్న మసి పోదు సరికదా ఇంకా దిట్టంగా, పడుతుంది. భగవంతుణ్ణి ఆశ్రయించి నామంచేసుకునే వారు ఈ విషయం చక్కగా తెలుసుకోవాలి.

ఎవరూ కష్టాలకూ, నష్టాలకూ, దారిద్ర్యానికీ, అపనిందలకూ, దూషణలకూ భయపడరాదు. అలా భయపడక, తమ అంతఃకరణాలను పరిశీలించుకుంటూ జాగ్రత్తగా ఉంటే పాపం అనే మసి వదలిపోతుంది. అంతేకాదు, మసి వదలించటానికి ఇసుక మొదలైనవి వేసి తోమటానికి సాధనమైన గడ్డిచుట్టకు ఆ మసి అంటుకుంటుంది. అలాగే, తమకు పాపం అనే ఈ మసి పోవటం మాత్రమే కాదు; ఈ మసి పోవటానికి కారణమైన కష్టాలు, నిందలు మొదలైనవాటికి నిమిత్తమాత్రులైనవారికి అంటుకుంటుంది ఈ పాపం. అలాగే పుణ్యానుభవమైన సుఖాలు, లాభాలు, పొగడ్తలు మొదలైనవి కలిగినప్పుడు పొంగిపోరాదు. అలా పొంగిపోక, తమ అంతఃకరణాను పరిశీలించుకుంటూ, జాగ్రత్తగా ఉంటే పుణ్యం అనే మసి వదలిపోతుంది. అంతేకాదు, ఈ మసి వీటికి నిమిత్తమాత్రులైన వారికి అంటుకుంటుంది.

కొంతమంది తెలివితక్కువవారు తిని కూర్చో లేక, ఉన్నవీ లేనివీ ఇతరులను గురించి సంభాషణలుచేసి దారేపోయే పెద్దమ్మా వచ్చి నెత్తినకూర్చోమని ఆహ్వానం చేస్తూ ఉంటారు. వాళ్ళు అలా చెయ్యటం సాధకులకు మంచిదే. వీరి పాపపుణ్యాలు వారికి చెందుతాయి. వీరికి పరమాత్మానుగ్రహం లభిస్తుంది.

అయితే, ఇలా ఇతరుల పాపపుణ్యాలను తెలివి తక్కువగా తమ నెత్తిమీదకు పడలాక్కునే వాళ్ళను చూచి మనం జాలిపడాలిగాని, ద్వేషించకూడదు.

అన్నిటికంటె విచారకరమైన దేమంటే, ఇలా ఇతరుల పాపపుణ్యాలను అనవసరంగా తమ నెత్తికి తెచ్చు కునేవారు నావారిలో కూడా కొంతమంది ఉన్నారు.

ఏం చెయ్యగలను - హృదయంలో బాధపడుతూ ఊరుకోవటంతప్ప? చెప్పినా వారికిష్టమైనదైతే వింటారు; కాకపోతే వినరాయె! అంతేకాదు-నా విషయంలోకూడా అలాగే ఉంటారు. వారికి నచ్చినవిషయంలో గురువుగారు మంచివారు అని స్తుతిస్తారు. నచ్చని విషయంలో విమ ర్శిస్తారు.

గురువు కూడా శిష్యుల ఇష్టంవచ్చినట్టు ఉండాలి. ఇది కలి ప్రభావమో ఏమో? మీరు మాత్రం

అలా ఉండకండి! విశ్వాసం సడలనీయకండి! అపనింద లకూ, దూషణలకూ బాధపడకండి! పొగడ్తలకు పొంగకండి! గౌరవాలకై ప్రాకులాడకండి! మిమ్మల్ని దూషించే వారినీ, పైకి ప్రేమ చూపిస్తూ, లోపల విమర్శించే వారినీ కూడా- మీకు పరమార్థం కావాలనుకుంటే మాత్రం- ఏ మాత్రం ద్వేషించకండి. అంతేకాదు- ప్రేమించండి! లోకం సాధకులకు ఒరిపిడిరాయి అనే విషయం ఏక్షణంలోనూ మరవకండి.

మనస్సు వికారంచెందే ఘట్టాలు చాలాఉన్నాయి లోకంలో. మనస్సు పూర్తిగా వికారరహితం అయితేగాని భగవదనుభవం కలగదు. అందుకని సాధకులకోసం వికారాలు కలిగించే ఘట్టాలతో విశ్వాన్ని నిర్మించి సాధకులకొక ఒరిపిడిరాయిగా ఏర్పాటుచేశాడు విశ్వాన్ని పరమాత్మ.

ఆ యా ఘట్టాలు తటస్థపడినప్పుడు నిజమైన సాధకులకు తమ మనస్సు వికారంచెందిందో లేదో తెలుసుకోవటానికి అవకాశం చిక్కుతుంది. దూషణలకు, నిందలకు, అపకారాలకు, కోపతాపాలు పొందటం, బాధ పడటం అనే వికారాలకు లోనౌతుంది మనస్సు. అప్పుడు నిజమైన సాధకులైతే, వాటికి కారకులైన వ్యక్తుల

విషయంలో కోపతాపాలకులోనవక, తమమనస్సులో వికారం చెందే లక్షణం ఇంకా పోలేదే అని సిగ్గుపడతారు; పశ్చాత్తాపం చెందుతారు. ఈ విషయాలు తెలుసుకుని మీరు ప్రతిక్షణం జాగ్రత్తగా మెలగండి!

ఈ విషయాన్ని మాత్రం నిర్లక్ష్యం చేసి, ఎన్ని తపస్సులు చేసినా, ఎన్ని యోగాలు సాధించినా, ఎన్ని సిద్ధులు, శక్తులు సంపాదించినా, వాటివల్ల లోకానికీ, తనకూ కూడా కీడే అవుతుంది.

రాగద్వేషాలు ఏమాత్రమూ లేకుండా, ఏ సందర్భంలోనూ మనస్సు ఏ మాత్రం వికారం చెందని నిర్వికార స్థితిని పొంది, భగవన్నామంలో ఆనందాన్ని అనుభవించేవారికి బాహ్యంగా ఏ తపస్సులూ, ఏ యోగాలూ లేకపోయినా, ఏ సిద్ధులూ, శక్తులూ వ్యక్తంకాకపోయినా, ఈ జీవితమే ఆనంద ప్రపూర్ణం.

సామాన్య దృష్టితో దుఃఖాలయం అని చెప్ప బడిన ఈ విశ్వమే బ్రహ్మానందసాగరం వారికి. వారి విషయంలో, దుఃఖాలయమైన విశ్వం ఏనాడో భస్మమై, బ్రహ్మానంద సముద్రం యొక్క ఉత్తుంగ తరంగాలతో అప్రాకృత తత్త్వమే వారికి సాక్షాత్కరిస్తుంది. ఆ స్థితిని మాటల్లో ఎలా చెప్పగలం! ఆ స్థితిని మనస్సే

అందుకోలేదా యె ! ధ్రువనక్షత్రం నక్కకు ఎంత అందు బాటులో ఉంటుందో, పైన చెప్పిన ఆ మహోత్కృష్టమైన స్థితి మనస్సుకు అంత అందుబాటులో ఉంటుంది. ఇక మాటల కందటంవిషయం చెప్పాలా ?

మీ రంతా ఈ జీవితంలోనే ఆ స్థితిని పొందాలని నా కోరిక. ఇది గొంతెమ్మ కోరిక కావటమో, సఫలం కావటమో, మీ విశ్వాసం మీదా, మీ ధైర్య స్థైర్యాల మీదా ఆధారపడి ఉంది. మీ ధైర్య స్థైర్యాలు, మీరు భగవంతునికి త్రికరణశుద్ధిగా శరణాగతి చెయ్యటం మీద ఆధారపడి ఉంటాయి. లోకంమీదకు దృష్టి పోనీయకండి ! మీ లక్ష్యం మీద నుంచి దృష్టిని ఏమాత్రం సడలనీయకండి ! మీ అందరికీ శుభాశీస్సులు.

సదా మీ మేలుకోరు

**సీతారాం**

# 18

విజయవాడ

శ్రీరస్తు: చిరంజీవి.........కి:
ప్రేమపూర్వక నారాయణ స్మరణములతో
ఆశీర్వదించి: ఉభయకుశలోపరి:

ప్రియమైన బాబూ!

నీ లేఖ ద్వారా మీ యోగక్షేమాలు తెలిసి చాలా ఆనందించాము. మేము అవనిగడ్డనుంచి గత రాత్రే వచ్చాం ఈ రోజు ఉదయమే నీ లేఖ ఇచ్చారు. చదివాను; శ్రద్ధగా చదివాను. నీ మానసిక వేదన బాగా అర్థమైంది.

మానవులు తెలుసుకోవలసిన ముఖ్యవిషయం ఒక్కటే - ఆ విషయం తెలిస్తే ఈ జీవితం ఆనంద మయమే. అది తెలియకపోతే అంతా దుఃఖమయమే. తెలుసుకోవలసిన ఆ విషయం ఏమంటే-

జగత్తునందలి ప్రతి పరమాణువులోనూ - లోపలా బయటా కూడా - పరమాత్మ వ్యాపించి ఉన్నాడు. సామాన్య దృష్టితో ఆలోచిస్తే జగత్తు ప్రకృతి జీవాత్మలతో మిళితమై ఉంది. అంటే చేతనా చేతన మిళితం. దీన్నే జగత్తు అంటాము. విశేష దృష్టితో

చూస్తే - జడచేతన మిళితమైన ఈ జగత్తులో లోపలా బయటా కూడా పరమాత్మ వ్యాపించే ఉన్నాడు. పరమాత్మ వ్యాపించకుండా సూదిమొన మోపదగినంత ప్రదేశం కూడా లేదు.

ఈ జగత్తులో ప్రకృతి - జడవర్గం, ఆత్మ, పరమాత్మ - అని మూడు తత్త్వాలు ఉన్నాయి. ఈ మూడు తత్త్వాల్లో ప్రకృతి జ్ఞానం లేనిది. దానికి కష్ట నష్టాలంటూ లేవు. ఇక ఆత్మ, పరమాత్మ - అనే ఈ రెండు తత్త్వాలూ చేతనాలు - జ్ఞానం కలవి. ఈ రెంటిలో ఆత్మవర్గానికి కష్టసుఖాలున్నాయి - వీటికి జ్ఞానం ఉంది కనుక. ఆత్మలకున్న జ్ఞానం పరిపూర్ణం కాకపోవటంచేతా, ఉన్న జ్ఞానమైనా, అజ్ఞాన అన్యథాజ్ఞాన విపరీతజ్ఞానముల రూపంలో ఉండటంచేతా, ఈ ఆత్మకు కష్టాలే, దుఃఖాలే సంభవిస్తున్నాయి.

పరమాత్మ జ్ఞానం భ్రమ ప్రమాదాలకు ఎంత మాత్రం తావులేనిదీ, యథార్థమూ, అనంతమూ, పరిపూర్ణమూ కూడా అవటంచేతా, ఆయన సహజంగా పరిపూర్ణానంత ఆనంద స్వరూపుడవటంచేతా, ఆయనకు ఈ జగత్తువల్ల కలిగే వికారాలు- కష్టసుఖాలు- లేనేలేవు.

ఈ మూడు తత్త్వాల్లో ఎనభై నాలుగు లక్షల రకాల జన్మల్లో ఉన్న జీవసముదాయమంతా ఆత్మవర్గంలోనిదే. ఈ ఎనభై నాలుగు లక్షల రకాల జన్మల్లోనూ కడసారిదైన మానవ జన్మలో ఉన్న జీవులకే పరమార్థ జ్ఞానానికి అర్హత ఉంది. ఆ పరమార్థ జ్ఞానం కలగనంతవరకూ మిగతా జన్మల్లోని జీవరాసుల్లాగే మానవులుకూడా ప్రపంచంలోని ఇంద్రియసంబంధములైన విషయోపభోగాలకే ఏకారుతూ ఉంటారు. అందుచేత దుఃఖాలు తప్పవు. సక్రమమైన పద్ధతుల్లో పరమార్థ జ్ఞానాన్ని సంపాదించనంతకాలం, మిగతా జన్మల కంటె మానవజన్మ గొప్పది అనుకోవటంవల్ల ఏమీ లాభంలేదు ఇప్పుడు. మానవ ప్రపంచంలో చాలాభాగం పరమాత్మచేత ప్రసాదించబడిన ఈ ప్రత్యేక జ్ఞానాన్ని, మిగతా జన్మల్లోని జీవుల్లాగే పొట్ట పోసుకోవటానికీ ఇంద్రియాల్ని తృప్తిపరచుకోవటానికీ మాత్రమే ఉపయోగించుకోవటం కనబడుతుంది. కాక, మిగిలిన జీవరాసుల్లో లేని దురాశా, దుష్టస్వార్థమూ, మానవుల్లో ఉండటంచేత, వాటికంటె మానవుడు ఎక్కువ కష్టాలూ, దుఃఖాలూ అనుభవిస్తున్నాడు. జీవితం చివరకు నిరాశా పూరితం కాగా, ఆయుర్దాయం పూర్తికానిది శరీరాన్ని విడిచిపెట్టలేక, గత్యంతరం లేక కంప తోడుగులాగ లాగుతున్నాడు.

ఈ దురవస్థ తప్పి, జీవితాన్ని ఆనందమయం చేసుకోవాలంటే ఒక్కటే ఉపాయం.

ప్రకృతి దుఃఖమయం, పరమాత్మ ఆనందమయుడు. కనుక, ఎవని దృష్టి పరమాత్మను విడిచి ప్రకృతి మీదనే కేంద్రీకరింపబడుతుందో, అతనికి ప్రకృతి స్వరూపమైన దుఃఖమే అనుభవంలోకి వస్తుంది. ఎవని దృష్టి ప్రకృతిని విడిచి పరమాత్మమీదే కేంద్రీకరింపబడుతుందో అతనికి పరమాత్మ స్వరూపమైన ఆనందమే అనుభవంలోకి వస్తుంది.

ఈ జగత్తులో దేన్నీ తనది అనుకోవటానికి ఎవరికీ అధికారంలేదు. అంతకూ సర్వాధికారీ, సర్వేశ్వరుడూ పరమాత్మే. ఒకరివస్తువును ఇంకొకరు తనది అనుకోవటం దొంగతనం అని అందరికీ తెలిసిన విషయమే. అయినప్పుడు, పరమాత్మ యొక్క వస్తువును తనది అనుకుంటే అది దొంగతనం కాదా ? అలా అనుకునేవాడు దొంగ కాడా ? ఇక అతనికి దుఃఖాలూ, కష్టాలూ కాక సుఖం, ఆనందం ఎలా ఉంటాయి ! జీవితం అశాంతియుతం కాక, ప్రశాంతియుతం ఎలా అవుతుంది ?

"కొంతమంది అన్యాయాలూ అధర్మాలూ చేసి ధనం సంపాదించి, మేడల్లో హంసతూలికాతల్పాల

మీాద, తూగుటుయ్యాలలమీాద ఆనందాన్ని అనుభ వించటంలేదా ? సుఖపడటంలేదా ?" అని అడగవచ్చు.

అది సర్వాబద్ధం. దూరపుకొండలు నునుపు అన్నట్టు ప్రతివాడూ, అవతలివాడు తనకంటె సుఖంగా జీవిస్తు న్నాడని సామాన్యంగా అనుకోవటం జరుగుతున్నది. వాళ్ళకీ కష్టాలూ దుఃఖాలూ అపరిమితంగా ఉన్నాయి. కొంతమంది ఆ విషయం ఇతరులకు కనపడకుండా, తాము సుఖజీవనం చేస్తున్నట్టు కనపడతారు. బాహ్యంగా ఎన్ని ఉన్నా, వాళ్ళ మానసిక బాధలు చెప్పనలవికాదు.

అలాకాక, ఏ కొద్దిమందో ఈ ప్రాపంచిక జీవి తంలోనే ఆనందం అనుభవిస్తున్నట్టు భ్రాంతిపడినా, అది ఆనందంకాదు. వాళ్ళ అజ్ఞానం దట్టంగా ఉండటం చేత, ఆ కష్టాలూ, దుఃఖాలూ తాత్కాలికంగా తెలి యకపోవచ్చు. చిన్నచెట్టు మీాదనుంచి పడినవాడికి దెబ్బలు తగలటం, బాధలు కలగటం తెలుస్తుంది. కాని, ఒక మహావృక్షంయొక్క చిటారుకొమ్మ నుంచి పడినప్పుడు మనసు మూర్ఛ చెందటంవల్ల, పడ్డవెంటనే అతనికి ఏమీా తెలియకపోవచ్చు; స్పృహ లేకనే పోవచ్చు. అంతమాత్రంతో అతనికి దెబ్బలు తగ్గలేదని కాని, అది దుఃఖం కాదని కాని, అనుకుంటే అంతకంటె తెలివితక్కువతనం ఉండదు. మళ్ళీ అతనికి స్పృహ

రాగానే ఆ దెబ్బలు, ఆ బాధలు అపారంగా దుఃఖాన్ని కలిగించకతప్పదు.

అలాగే, కొంతమందికి అజ్ఞానం మరీ దట్టంగా ఉండటంచేత కష్టాలూ, నష్టాలూ తెలియకపోవటమే గాని, అది సుఖమూ ఆనందమూ ఎంతమాత్రం కాదు. కనుక పరమాత్మను విడిచి, దృష్టిని ప్రకృతిమీదనే కేంద్రీకరించి, విషయసంపాదనలోనే మునిగిఉన్న కొద్దీ దుఃఖాలే ఫలం - ఇది తప్పదు బాబూ! తప్పదు, తప్పదు.

ఎవని దృష్టి పరమాత్మ మీదకు మరలిందో, వానికి మాత్రమే ఆ మోతాదుకు తగినంతగా - ప్రకృతి దుఃఖం దూరం అవటమూ, నిజమైన ఆనందం యొక్క స్పర్శ తగలటమూ ప్రారంభం అవుతుంది.

అయితే, దృష్టి పరమాత్మ మీదకు మరలటం అంటే ఏమిటి? పరమాత్మ ఉన్నాడని విశ్వసించటం, పరమాత్మను జ్ఞాపకం ఉంచుకుని ప్రార్థనలు చెయ్యటం మాత్రమే కాదు. ఇది కూడా వ్యర్థం కాదుకాని సద్యః ఫలంలేదు; పూర్ణఫలం ఉండదు.

కొందరికి పరమాత్మ ఉన్నాడని విశ్వాసం ఉంటుంది. ఆయనగురించి ప్రార్థనలు చేస్తారుకూడా. కాని,

ఆ ప్రార్థనలు అన్నిటికీ సాంసారిక విషయాలూ సుఖాలూ మాత్రమే లక్ష్యంగా ఉంటాయి. అందువల్ల వీళ్ళ దృష్టి కూడా ప్రకృతియందే కేంద్రీకరింపబడి ఉన్నదన్నమాట. అందువల్ల వీళ్ళకు కూడా దుఃఖం తప్పటంలేదు. దృష్టి పరమాత్మ మీదకు మరలటం అంటే, అప్పుడే ఒక్క-మారుగా ప్రాపంచిక విషయాల్ని త్యజించలేకపోయినా, ఇవన్నీ అనిత్యాలనీ, తుచ్ఛములనీ, సుఖభ్రమను కలిగిస్తాయిగాని నిజానికి దుఃఖప్రదాలే అని తెలుసుకుని, యథార్థమైన జ్ఞాన భక్తి వైరాగ్యాలు ప్రసాదించవలసిందిగా ప్రార్థన జరిపే స్థితి లభిస్తే, ఇక జీవితం ధన్యమైందని భావించవచ్చు.

ఈ విచారణలో తేలిందేమంటే-

ప్రాపంచిక విషయాలూ ద్రవ్యాలూ కావు దుఃఖం కారణాలు- వాటినిగూర్చి తనది అనేభావం దుఃఖకారణం.

నీది ఏదీలేదు. దేన్నీ నీదనుకోకు ప్రాపంచిక సుఖాలమీంద దృష్టి ఉంచకు. ఇక దుఃఖాలూ కష్టాలూ బాధలూ ఎక్కడఉంటాయి! వాటికి తావేలేదు.

కొంప తగులబడింది. దానికి ఫలంగా దుఃఖం కలుగుతున్నది. నిజానికి దుఃఖం కొంప తగులబడినందుకు కాదు-తగులబడిన ఆ కొంపనుగూర్చి తనది అనే భావం-మమకారం-ఉండటంచేత కలుగుతున్నది. కొంప తగులబడటంచేత దుఃఖమైతే, ఏ కొంప తగులబడ్డా అందరికీ దుఃఖం కలగాలి గదా! అలా కలగటంలేదు- ఎందుచేత అంటే, ఆ కొంపయందు తనది అనే భావం అందరికీలేదు.

అందువల్ల, దుఃఖానికి కారణం తనది అనే భావమే. అలాగే, తనది అనబడే కొంప డాబాగా మారితే ఆనందం. ఆనందం కొంప డాబాగా మారటంవల్ల కాదు; డాబాగా మారిన ఆ కొంపనుగూర్చి తనది అనే భావం ఉండటం వల్ల. ప్రాపంచిక సంబంధములైన దుఃఖమూ, ఆనందమూ కూడా తనది అనే భావం-మమకారం - వల్లనే. కాబట్టి ఈ రెండూ తాత్కాలికములే; శాశ్వతాలు కావు. శాశ్వతాలు కావుగాని, ఒకదానివెంట మరొకటి సముద్ర తరంగాలవలె ఎడంలేకుండా వస్తూనే ఉంటాయి.

కష్టం, బాధ కలిగినప్పుడు మానవుడు దుఃఖం అనుభవిస్తాడు. సుఖం కలిగినప్పుడు మాత్రం ఆనందం కాదుగాని, ఆనంద భ్రాంతి - సంతోషం - అనుభవిస్తాడు. కాని, ఈ సంతోషం తాత్కాలికమూ, అల్పమూనూ. కాక, అనంతమూ, అంతకంటె గొప్పది లేనిదీ అయిన బ్రహ్మానందానికి ఈ సంతోషంకూడా ఆటంకమే. కనుక, తనది అనే భావం విడిచిపెట్టి, ఇదంతా భగవంతునిదే అనే భావం దృఢపరచుకున్నప్పుడు యథార్థమైన మన శాంతీ, ఆనందమూ లభిస్తాయి.

తనవి అనుకొనే వస్తువుల్లో జడవర్గంమాత్రమేకాక, చేతనవర్గంకూడా ఉంది. జడవర్గానికి మనస్సూ, జ్ఞానమూ లేవుకనుక, వాటికి సుఖదుఃఖాలు లేవు. తనకు ఇది కావాలి, అది కావాలి; తనవిషయంలో ఎదుటివారు ఇలా ఉండాలి, అలా ఉండాలి అన్న భావాలు ఉండటానికి అవకాశం లేదు. కనుక, వాటి విషయంలో తనవి అనే భావం

